శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీ సరస్వత్యై నమః

శ్రీ సీతా లక్ష్మణ హనుమత్సమేత శ్రీరామ చంద్ర

పరబ్రహ్మణే నమః

శ్రీ మైథిలీ మధుర మానస రాజహంసం
శ్రీ లక్ష్మణాఽనిలజ సేవిత పాదపద్మం।
భక్తాంతరంగ జలజార్చిత దివ్యమూర్తిం
అల్వాల రాఘవ పతిం ప్రణయామి నిత్యమ్

(శ్రీ భాగ్యనగరాంతర్గత శ్రీ పాచీనాలవాలపుర)

# శ్రీ రఘురామ స్తుతి వైజయన్తి

(కుశేశయ ప్రబంధము)


ర చ యి త

శ్రీమాన్ నల్లదీగ శ్రీనివాసాచార్యులు M.O.L. (ఇందిరాల)

సికింద్రాబాద్ మహబూబు కళాశాలా విశ్రాంత ప్రధానాంధ్రాధ్యాపకులు


---


This book is published with the Financal Assitance of "Tirumala Tirupati Devasthanam"s Under their Scheme aid to Publish Religious Books.

శ్రీ యువ సం॥ మధుమాసములు

1995

శ్రీమదార్షకళాభారతీనిలయ ప్రసూనము

గ్రంథము :- శ్రీ రఘురామ - రఘూత్తమ స్తుతి వైజయన్తి (ప్రాచీనాలవాల పురము - శ్రీరామసాగరము).

రచయిత :- శ్రీమాన్ నల్లదీగ శ్రీనివాసాచార్యులు M.O.L. (ఇందిరాల) సికింద్రాబాద్ మహబూబు కళాశాలా విశ్రాంత ప్రధానాంధ్రా ధ్యాపకులు.

ప్రథమ ముద్రణము:- శ్రీ యువ సం॥ మధుమాసములు 1995.

గ్రంథముద్రణ సహాయకర్తలు:- తిరుమల తిరుపతి దేవస్థానము యాజమాన్యము వారు (హిందూ ధర్మ సంస్థాపన గ్రంథ ప్రచురణకర్తలు).

ప్రతులు : ౧౦౦౦.

ప్రాప్తిస్థానము :- 1. ప్రాచీనాలవాలరామచంద్రస్వామివారి దేవస్థానము.
2. శ్రీరామసాగర (పోచంపాడ్) కోదండ రామస్వామి దేవస్థానము.
3. శ్రీరామా బుక్ డిపో, మార్కెట్ వీధి, సికింద్రాబాద్.

గ్రంథముద్రణ :- పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్, 1.1.517/బి/1, న్యూ బాకారం, గాంధీనగర్, హైదరాబాద్-500 380. ఫోన్: 7611413.



వెల : రు. 30/-

పత్రదాతలు :- శ్రీరామా పబ్లిషర్స్ యాజమాన్యమువారు కొంత పత్రమునిచ్చి సహకరించిరి. వారిని శ్రీరామచంద్రస్వామి సర్వదా కాపాడు గాత యని ఆకాంక్షించుచున్నాను.

శ్రీ

శ్రీ ప్రాచీనాలవాలాఖ్య - పురీ వర నికేతనః।
శ్రీ జానకీ రామ చంద్ర - స్వామీ మాం పాతు సర్వదా॥

# కృతిపతి



శ్రీ ప్రాచీనాలవాలపుర శ్రీసీతాలక్ష్మణహనుమత్సమేత శ్రీరామచంద్రస్వామివారు

ఈ గ్రంథము : కీ.శే. శ్రీమాన్ దరూరి నరసింహాచార్యులవారు

,, శ్రీమాన్ అనంతాచార్యులవారు

,, శ్రీమాన్ శేషాచార్యులవారు

,, శ్రీమాన్ కొమాండూరి పరాంకుశాచార్యులవారు

మరియు దేవాలయ ధర్మకర్తలు కీ. శే. బొంగు రామచంద్రరావు గారు, వీరందరి స్మారకార్థముగా శ్రీ సీతారామచంద్రస్వామివారి పాదపద్మములలో సమర్పింపబడి తదీయులకు బహూకరింపబడినది.

—యన్. శ్రీ. ఆచార్యులు

# విషయసూచిక

శ్రీహయగ్రీవాయ నమః
శ్రీ సీతాలక్ష్మణ హనుమత్సమేత శ్రీరామచంద్ర
పరబ్రహ్మణే నమః

# నమ్ర వినతి

శ్రీ సీతాలక్ష్మణోపేతం। ఆంజనేయాఽభివందితం।
భక్తహృత్పద్మ బాలార్కం। వన్దే కోదండరాఘవమ్॥

శ్రీమంతంబులైన దక్షిణోత్తర భారతదేశంబులు పుణ్య తీర్థ క్షేత్ర రాజంబులకు ఆలవాలమై యున్నవి. దేవ తిర్యఙ్మనుష్య స్థావరాదులకు ఐహికాముష్మిక సుఖ ప్రదంబులై యున్నవి. ధార్మికులకు సత్యసంధులకు శమ దమాది తపో నియమ నిష్ఠులైన తపోధనులకు యోగులకు సాధుజనులకు సద్భక్తులకు ఋషి పుంగవులైన పుణ్యపురుషులకు ప్రపన్నులకు జన్మ కారకములై తారకములై యున్నవి, వేద శాస్త్ర స్మృతి పురాణేతిహాసాది గ్రంథములు అభివ్యక్తములగుటకు; భగవతత్త్వ వైభవ ప్రతిపాదకములైన దివ్య ప్రబంధములు వెలయుటకు; రామాయణ భారత భాగవతాది మహాకావ్యములు ఆవిర్భవించుటకు; కారణభూతులైన వాల్మీకి వ్యాస కాళిదాసాది మహర్షులునైన కవి పుంగవులకు ప్రసన్నులునైన ఆళ్వారాదులు నాయన్మారులు మొదలగు సజ్జనులకు కన్నతల్లులై యలరారుచున్నవి.

ఇంతియేకాక, ఆచార విచార వ్యవహారాది సంస్కృతీ సభ్యతలకు సర్వమత సామరస్యతలకును - ఇన్నింటికంటే చరాచర జీవకోటిని తరింపవెలసిన భగవదవతారములకు నిలయములైన వై జగద్విఖ్యాతమై ఈ యుభయ భారతదేశములు అన్నింటా విశ్వ విఖ్యాతి నార్జించుకొనుచున్నవి. యావద్విశ్వమున ఇటువంటి దేశములు నభూతో నభవిష్యతి అన్నట్లున్నవి.

ఈ ఉభయ భారతదేశములతో మతత్రయులకు ఆరాధింపదగిన సేవింపదగిన క్షేత్రములు శైవ వైష్ణవ శాక్తేయాది క్షేత్రములు స్వయంవ్యక్తములుగాను ప్రతిష్ఠితములుగాను ప్రాచీనమునుండి విరాజిల్లుచున్నవి. నాటినుండి నేటికిని, ఈనాటికిని భక్తులచే సేవింపబడుచు ఆరాధింపబడుచునే యున్నవి.

అదే విధముగ భారతాంతర్భాగమైన అన్నపూర్ణయైన ఆంధ్ర దేశములోను, అందున త్రిలింగ ప్రాంతమున (తెలంగాణమున) పూర్వము జాగీర్దారులు జమీందారులు దేశముఖులు దేశ పాండ్యులు భక్త శిఖామణులు నైన శ్రీమంతులు వణిగ్వరులు తమ తమ ప్రదేశములలో తమ తమ యిష్టదైవములను ప్రతిష్ఠింప జేసికొని ఆ దేవతా మూర్తుల నారాధించి ఇహపర సౌఖ్యముల నందినారు; నేటికిని అర్చించి భక్తులు అందుకొనుచున్నారు.

అవిధముగానే మన ఆంధ్ర రాజధానియైన భాగ్యనగరమునకు ఉత్తరమున ప్రాచీనాలవాల పురమున శ్రీ కోదండ రామచంద్రస్వామి క్షేత్రము మహిమాన్వితమై అలరారుచున్నది.

ఈ దేవాలయ ధర్మకర్తలు బొంగు వంశ సంజాతులైన శ్రీరామచంద్ర రాయ నరసింగరాయల పూర్వీకులు మూల పురుషులు నైన మొదటి బొంగు రామచంద్రరావుగారు తమ యింటి ఇలవేల్పైన భద్రాచల రామచంద్రస్వామివారి స్వరూపమూర్తులను దేవాలయము కట్టించి ఈ అల్వాల గ్రామమున ప్రతిష్ఠింప జేసి ఆరాధించి సేవించి తరించినారు

ఈ దేవాలయ నిర్మాణము దాదాపు 3 - 4 వందల సంవత్సరముల క్రిందట జరిగియుండునని పెద్దల మాట. బొంగు వంశీయుల నిర్వాచనము అనాటినుండి నేటివరకు బొంగు వంశీయులే ధర్మకర్తలై దేవాలయ నిత్యా పూజాది కార్యక్రమములను అర్చక స్వాములు బొంగువారి ఆచార్యులు దరూరి వంశజులచే నేటికిని నిర్వర్తింపచేయించుచున్నారు, బొంగు వారొకరేకాక తత్రత్యులైన భక్తులెల్లరు స్వామిని సేవించి తరించుచున్నారు.

ఈ దేవాలయమునకు అర్చక పాచక ఆచార్యస్థానార్యులు ఆ దరూరి వంశస్థులే ఉన్నారు. వారే ధర్మకర్తల ఆదేశముల ననుసరించి శ్రీ స్వామివారికి కైంకర్య విధులు ఈనాటికిని నిర్వర్తించుచున్నారు. ఆ దరూరి వంశీయులలో కొన్ని తరములు గడిచినవి. ధర్మకర్తలలో కొన్ని తరములు గడచినవి. ప్రస్తుతమున్న వారు కీ॥ శే॥ శ్రీమాన్ దరూరి నరసింహాచార్యులవారి కుమారులు, కీ॥ శే॥ శ్రీమాన్ అనంతాచార్యులవారి కుమారులు, శ్రీమాన్ కృష్ణమాచార్యులగారు వారి కుమారులు, కీ॥ శే॥ శ్రీమాన్ శేషాచార్యులవారి కుమారులు, వీరు ఈనాటికి కూడ శ్రీరామచంద్రస్వామివారికి కైంకర్య విధులు నెరవేర్చుచున్నారు, ధర్మకర్తల వంశస్థులలో ఈనాటి కీ॥ శే॥ శ్రీరామచంద్రరావుగారి కుమారులు; మహారాజశ్రీ బొంగు నరసింహారావుగారు, వారి తమ్ములు; కుమారులు మొదలగువారు తమ విధులచే స్వామివారికి కైంకర్యముల జరిపించుచు తరించుచున్నారు.

ఇచట అర్చకస్వాములైన దరూరి వంశస్థులకు, నల్లదీగవారమైన మా తండ్రి తాత ముత్తాలకు అనాదినుండి సంబంధ బాంధవ్యములు తామరతంపరగా నున్నందున నేను తరచు అల్వాలకు శ్రీస్వామివారి కల్యాణోత్సవములకు వెళ్ళి వచ్చుచుండువాడను.

కీ॥శే॥ శ్రీమాన్ దరూరి నరసింహాచార్యులవారి అల్లుడు, మా తాతగారి కుమారుడు కీ॥శే॥ శ్రీమాన్ కొమాండూరి పరాంకుశాచార్యులవారి ఆజ్ఞయే భగవత్ప్రేరణగా భావించి, వారి ఆజ్ఞను శిరసావహించి ఈ చిన్నని కృతిని రచించి తదీయుల ధర్మకర్తల సహాయముచే శ్రీమాన్ నరసింహాచార్యుల అనంతాచార్యుల శేషాచార్యుల పరాంకుశాచార్యుల సంస్మృతి చిహ్నముగాను ధర్మకర్తలైన కీ॥శే॥బొంగు రామచంద్రరావుగారి జ్ఞాపకార్థమ్ముగ శ్రీరామచంద్రస్వామి వారి పాదపద్మములలో సమర్పించి నన్నును నా కృతిని సార్థకము గావించుకొంటిని.

ఇందు 1. ఇష్టదేవతాది స్తుతి 2. క్షేత్ర దర్శనము 3. క్షేత్ర వైభవము 4. మేలుకొలుపు 5. ప్రపత్తి స్తుతి 6. విన్నపము 7. సంస్తుతి రత్నము 8. మంగళము-కృత్యంత గద్యము అను ఖండికలు గలవు. ఈ ఎనిమిది ఖండికలతో "శ్రీరఘురామ స్తుతి వైజయన్తి" అను పేరుతో కృతిని వెలయించి స్వామి అనుగ్రహించిన కవితాశ్రీని ధన్యము గావించుకున్నాను.

అట్లే - ఉత్తర తెలంగాణా ప్రాంతమందు గోదావరీ తీరమున (శ్రీరామ సాగర్) ప్రాంతమున శ్రీమన్నారాయణ పెదజియ్యర్ స్వామివారి కరకమలములతో ప్రతిష్ఠితంబైన శ్రీ కోదండరామస్వామివారిని గూర్చి "శ్రీరఘూత్తమా" అను మకుటంతో "రఘూత్తమ స్తుతి వైజయన్తి" అను కృతిని వెలయించి శ్రీ స్వామివారి పాదపద్మములలో సమర్పించుకొంటిని.

ఈ కృతికి ప్రేరకులు తత్రత్యులు ప్రభుత్వోద్యోగులు ప్రధాన ఇంజనీరింగ్ శాఖాధికారులు మాకు సహోదరతుల్యులు శ్రీమాన్ దరూరి మనోహరాచార్యుల వారు పరమ భక్తాగ్రేసరులు వాగ్గేయకారులు ప్రపన్నజనాదరణీయులు ధర్మాచరణ తత్పరులు నైనందున వారి అభిమతమే స్వామివారి ఆజ్ఞగా భావించి ఈ "రఘూత్తమ స్తుతివైజయన్తి"యనుకృతిని భగవద్భాగవతాచార్యానుగ్రహముతో నిమిత్తమాత్రుడనై స్వామి పలికింపజేయగా పలికి వెలయించితిని. శ్రీ దేవస్థానమువారి ఆహ్వానమును పురస్కరించుకొని తద్దేవస్థాన ప్రధాన కార్యవర్గ

సభ్యులలో ముఖ్యులైన శ్రీమాన్ దరూరి మనోహరాచార్యులవారి ఆదేశాహ్వానమును స్వామివారి ఆజ్ఞగా భావించి అచ్చటికి వెడలి శ్రీ స్వామివారి కల్యాణోత్సవ సందర్భమున కృతిని గానము చేసి స్వామి పాదపద్మములలో సమర్పించుకొని నన్నును నా కవితను ధన్యము గావించుకొంటిని.

ఈ గ్రంథ ద్వయమును ఒకటిగా చేర్చి "శ్రీ రఘురామ స్తుతి వైజయన్తి" అను పేరుతో గ్రంథరూపముగా వెలయించి భక్తలోకమునకు అందింపదలంచితిని. కాని,ఆర్థికస్తోమతలేనివాడనైనందున ధర్మప్రచారమునకు కంకణము కట్టుకొన్న శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన యాజమాన్యమును నియమానుసారంగా అర్థించి వారిచ్చిన యథోచితమైన ఆర్థిక సహాయ సంపత్తిచేతను, మాన్యులు శ్రీ బొంగు నరసింహారావుగారు మొదలగు ధర్మకర్తల సహాయముచే తను శ్రీరామసాగర్ శ్రీరామ దేవస్థానమువారి యథోచిత సహాయముచే, శ్రీమాన్ దరూరి నరసింహాచార్యుల గారి సహోదర పుత్ర పుత్రీ పౌత్రాదుల చేదోడువాదోడులచే వారి వారి కుటుంబీకుల సహాయ సంపత్తిచే భగవద్భాగవతాచార్య విధేయులైన శ్రీమాన్ దరూరి మనోహరాచార్యాది పరమప్రపన్నుల ఆదరాభిమానములచే ఈ గ్రంథము సర్వాంగసుందరముగా ముద్రించి భగవత్కృపచే లోకవిదితము గావింపబడినది. ఈ గ్రంథమునకు సహకరించిన తిరుమల తిరుపతి దేవస్థాన యాజమాన్యము వారికి సహృదయులు సాహితీప్రియులు భక్తితత్పరులైన అల్వాల; శ్రీరామసాగర; దేవాలయ ధర్మకర్తలకు అర్చకవర్యులకు ప్రత్యేకంగా అల్వాల దరూరి వంశజులైన అర్చకాచార్యవర్యులకు కృతజ్ఞతానమస్సులందించుకొనుచున్నాను; కృతి వెలువడుటకు ప్రేరకులైన సహృదయులైన పెద్దలకు పిన్నలకు శుభాభినందనల నందించుకొనుచున్నాను

గ్రంథమును సర్వాంగ సుందరంగా ముద్రించి యిచ్చిన శ్రీ పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ యాజమాన్యము వారికి, కార్యకర్తలకు కృతజ్ఞతాపూర్వకమైన శుభాశీస్సులందించుకొనుచు, వీరిని శ్రీరామచంద్రస్వామి సర్వదా కాపాడునని తలంచుచున్నాను. భక్తులైన సాహితీబాంధవులు క్షీరనీరన్యాయమున వర్తిల్లి గ్రంథములోని మాధుర్యాది గుణములు గల భక్తిని చవిచూచి ఆనందించి మమ్మానందింపజేతురని సవినయముగా అవనతమతినై విన్నవించుకొనుచున్నాను.

'శ్రీ శుభం భవతు'

**రచయిత**

శ్రీః
శ్రీ హయగ్రీవాయ నమః
శ్రీ వాగ్దేవ్యై నమః
శ్రీ సీతా లక్ష్మణ హనుమ త్సమేత
శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

## శ్రీ ప్రాచీనాలవాలపుర

# శ్రీ రఘురామ-స్తుతివైజయన్తి

## (కుశేశయ ప్రబంధము - ప్రథమ స్తబకము)

## సంస్తుతిః

శ్రీ జానకీ స్మిత ముఖాంబుజ చంచరీకం
యోగీంద్ర యోగమయ మానస రాజహంసం।
వందారు భక్తజన మానిత పారిజాతం
అల్వాల రాఘవ పతిం ప్రణమామి దేవమ్॥ ౧

శ్రీ అల్వాలపురీ మనోజ్ఞ నిలయే
శ్రీ సీతయా శోభితః
శ్రీ మల్లక్ష్మణ సూరిణాఽనిల-
సుతేనాఽనంద సంభావితః
శ్రీమ ద్భవ్య దరూరి వంశ-
నరసింహాఽద్యై ర్బుధై స్సన్నుతః
శ్రీ వైకుంఠ పదాఽభిరామ రఘురాట్
మాం పాతు సర్వేశ్వరః॥ ౨

శ్రీమద్ధరూరి వరవంశ లసద్విజేంద్రైః
శ్రీనారసింహ వరకృష్ణ బుధాద్యనంత-
భక్తార్చకై స్సుకృతిభక్తజనైర్నుతం తం
ఆల్వాల రాఘవ పతిం ప్రణమామి దేవమ్॥ ౩

శ్రీమద్భక్తజనైః మనోజ్ఞ సుదిభి శ్శ్రీబొంగువంశోత్తమైః
శ్రీ సంభావిత రామచంద్ర నరసింహారాయ భక్తాదిభిః
శ్రేయోదార పవిత్ర కింకరజనైః భక్త్యా సుసంభావితం
శ్రీఆల్వాపురీశ్వరం రఘుపతిం కోదండరామం భజే॥ ౪

శ్రీఆల్వాలపురీ మనోజ్ఞనిలయే శ్రీ సీతయా భూషితం
శ్రీమల్లక్ష్మణ సూరిణాఽనిలసుతేనాఽరాధనై స్సేవితం
కారుణ్యామృతపూర్ణ పద్మనయనం సుస్మేరదిగ్ధాననం
శ్రీధర్మాకృతి మాపదా మపహరం కోదండరామం భజే॥ ౫

శ్రీమైథిలీ లక్ష్మణ పార్శ్వయుగ్మం
శ్రీసుందరాఽభ్యర్చిత పాదపద్మం।
తూణీర బాణాసన భూషణాఢ్యం
రామం భజే భక్త హృదబ్జభృంగమ్॥ ౬

శ్రీ సీతా హృదయాబ్జ
కర్ణిక లస చ్ఛ్రీమన్మిళిందేశ్వరః
భక్తాఽనేక మనోజ్ఞ మానస నట
ద్ధంసోత్తమ స్సత్కృపాఽ
వాసాంతఃకరణః దయామృతలస
ద్దృష్ట్యాఽయతాఽబ్జేక్షణః
శ్రీసౌఖ్యం వితరన్ సదాఽవతు నః
శ్రీరామచంద్ర ప్రభుః॥ ౭

శ్రితార్త జనరక్షకం మునిమనోహరం సుందరం
సురారి దమనేరతం త్రిభువనావఽనం సన్నుతం।
మదీయ హృదయాంబుజే లసతు రామపాదద్వయం
సదా మధుర సేవనైః రహసి సీతయా చుంబితమ్॥

జయతు జయతు దేవో సూర్యవంశ ప్రదీపః
జయతు జయతు రామ స్సాధు సంఘప్రకాశః।
జయతు జయతు సీతా మానసాంభోజభృంగః
జయతు జయతు భక్తాభీష్టదాఽనందమూర్తిః॥

శ్రీః

శ్రీ సీతారామచంద్ర స్వామినే నమః

# కృతిసమర్పణము

శ్రీమధురైక నామ వివశీ -
కృత యోగిమనోఽభిరామ! శ్రీ
రామ! భవత్కృపల్ గలుగ
వ్రాసితి నీకృతి మీకొసంగితిన్
నా మదియందు నిల్చి నను
నా కృతిఁగైకొనుమయ్య! మ్రొక్కెదన్
శ్రీ మహితాలవాలపుర
శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా!

ఆ మునినాథ నాథముని కాశ్రితుఁడౌ పరతత్త్వ వేదియౌ
యామున దేశికోత్తముని యారని సత్కృప పల్కఁజేయగా
నామది పల్కినట్టి కృతి నాదరముంచి గ్రహించి నాకిలన్
మీ మహితాంఘ్రి నందనిడుమీ! రఘురామ! దయాబ్ధిచంద్రమా!

ఎందఱొ నీకు భక్తులు ననేకులు మేలగు వస్తు సంపదన్
అందగజేసి మీకిట తమంతట తామె తరించిరయ్య! నే
నెందున రిక్తునైన మది నిన్నని నీ విడినట్టి వాక్కు నీ
కందిడితిన్ గ్రహింపుము; తగన్ రఘురామ! దయాబ్ధిచంద్రమా!

పరమ దరూరి వంశ ఘన వార్నిధి రత్నములౌ నృసింహ స
ద్వరసుత రామచంద్ర బుధవర్యులు సోదరులాది తత్సుతుల్
సరసులు; వారి యాజ్ఞఁ దమ చక్కని యాజ్ఞగనెంచి యీ కృతిన్
మరువక నిచ్చుకొంటి గొనుమా! రఘురామ! దయాబ్ధి చంద్రమా!

పసితనమందు బాలకుని పల్కులు దోసములున్న ముద్దులై
మసలగ వానిఁ గ్రోలు విధమారసి; దాసుని పల్కు నెన్ని; నా
కొసగుడు పేర్మి దీవెనల కోరితి సజ్జనులార! యంచు నా
రసికుల వేడి గొల్చితినిరా! రఘురామ! దయాబ్ధి చంద్రమా!

దొసగుల నెంచకన్ మదికి దోచిన తీరున మంచి నెంచి; యీ
మసలిన నా కృతిన్ సరసమైన మతిం గని నాకు దీవెనల్
విసరుడటంచు విజ్ఞులను వేడి త్వదంఘ్రుల నీకృతిన్ ముదం
బెసగ నొసంగినాను గొనవే! రఘురామ! దయాబ్ధి చంద్రమా!

—: శ్రీశుభంభవతు :—

శ్రీః

శ్రీః

శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీ సీతా లక్ష్మణ హనుమ త్సమేత శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

శ్రీ సరస్వత్యై నమః

## శ్రీ ప్రాచీనాలవాలపుర

# శ్రీ రఘురామ - స్తుతి వైజయన్తి

## కుశేశయ ప్రబంధము - ప్రథమ స్తబకము)

శ్రీ శుభమౌ నజాండమయ
సృష్టికి కారణభూతుఁడెవ్వఁడో,
శ్రీశ శివాఽజరూపుడని
చెప్పెడి వేద విధిజ్ఞుఁడెవ్వఁడో,
శ్రీ శరదిందు కీర్తిగల
శ్రీపతి యెవ్వడో? యీశుఁడెవ్వఁడో
నే శరణంటి వాఁడనుచు
నిన్; రఘురామ! దయాబ్ధి చంద్రమా!

శ్రీమధురైకనామ! సరసీరుహ సుందరపాదసీమ! సీ
తామహితాంతరంగ హిత దైవకళాకమనీయ దీపమా!
తామరసాఽయతాఽతిలలితాశ్రయ నేత్రలస త్కృపౌఘమా!
శ్రీమహిమాలవాలపుర శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧

శ్రీవసుధాత్మజా హృదయ శీతల నీరజ మత్త భృంగమా!
భావజ కోటి రమ్య! రసవ ద్ఘననీల తనూ విలాసమా!
శ్రీవిజయైక కార్ముక సుసేవిత సుందరబాహుసీమ! రా
మా! వినుతింతు నన్ను గనుమా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨

మధురతమైక దివ్య మహిమాన్విత సుందర రామనామ! శ్రీ
పృధుశరచాపయుక్త ఘనపీవర బాహుబలైకధామ! స
ద్విధి విహితాఽగమోజ్జ్వల వివేక వివర్ధిత ధర్మకామ! శ్రీ
పదలలితాలవాల విభవా! రఘురామ! దయాబ్ధిచంద్రమా!

కోసలరాట్సుతా లలిత కోమల గర్భసుశుక్తి మౌక్తికా
శ్రీసుకృతైక సత్ఫలమ! చిద్ఘనోన్నత దివ్యధర్యమా!
దాసజనాంతరంగ విహితాదర నామజపాఽనుకూలమా!
శ్రీసుజనాఽలవాలపుర శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా!

దానవలోక దుర్గహన దాహక భీషణ వీతిహోత్రమా!
దీనజనార్తి తాపహర దివ్యకృపా మధురాంతరంగమా!
శ్రీనుత సత్కృపానిబిడ శీతలనేత్ర సితాబ్జపత్రమా!
శ్రీనిచయాలవాలపుర శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా!

ఖలహితదైత్యలోక పటుకానన తీక్ష్ణకుఠార! దివ్య దు
జ్జ్వల లలితేంద్రనీలమణివర్ణ! జయంకరదివ్యనామ! మం
గళకర సద్గుణాంబునిధి! కర్మలవిత్ర! షడుగ్రవైరిని
ర్దళన! జయాలవాల వరదా! రఘురామ! దయాబ్ధిచంద్రమా!

అజ హర దేవరాట్సురగణార్చిత దివ్య వికుంఠ సీమ!వా
యుజ ఖగరాడహీశ్వర జయోన్నత కింకరకీర్తిత్రైక ది
గ్విజయ గుణాభిరామ! విజిగీషఖలాసుర దుర్విరామ! ఖా
వజసుగుణాభిరామ! గనవా? రఘురామ! దయాబ్ధిచంద్రమా!

నళినదళాఽయతేక్షణ! అనారతధర్మపథానురక్షణా!
అలఘు తపోధనైక విబుధాది సుదీడిత సత్యలక్షణా!
బలరిపుదైత్యసూదన! కృపాఽమృత లాలిత హృద్విలక్షణా!
దళిత ఖలాఽఘతీక్ష్ణ! వరదా! రఘురామ! దయాబ్ధిచంద్రమా!

త్రిభువన పావనైక గుణ రీతి లసచ్ఛృతకోటి విస్తరో
చ్ఛృభకర సత్యతానిబిడ సాధుచరిత్ర పవిత్రగోత్ర! స
ద్విభవ సుఖాఽనుకూలహిత దివ్యగుణాఽవనిజా కళత్ర! నా
కభయ మొసంగి బ్రోవు మనఘా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౯

మండిత సూర్యవంశధన! మానధనా! కరుణావిలక్షణా!
దండిత శాఠ్య ధూర్త ఖలదైత్యగణా! నయధర్మ లక్షణా!
ఖండిత షడ్రిపూగ్రగణ! కామితదాన! శ్రితార్తిహారణా!
దండము కావుమయ్య! వరదా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౦

ఖలులగు దైత్యులన్ దునుమగల్గిన దోర్బల ధైర్యశాలి! మం
జుల మృదు చంచలాఢ్య ఘనసుందర నీరద నీలవర్ణ! మం
గళకర సద్గుణాబ్ధి! అనఘాఽ శ్రిత ధార్మిక లోకపాల! సే
వలనిడఁజేరినాను గనవా? రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౧

(హరి హర బ్రహ్మాది స్తుతి)

హరి పరమేష్ఠి పంచసుముఖాఽనఘ షణ్ముఖ వేత్రహస్తులన్;
హరిపరివారమున్; దురితహారుల దివ్యుల; నిత్యసూరులన్;
పరమ పవిత్ర భాగవత వర్యుల; ప్రస్తుతిఁజేసి: మిమ్ములన్-
స్థిరముగఁ బల్కవేడెదను, శ్రీ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౨

(హయవదన స్వామి)

నయ వినయాది సద్గుణ గణాశ్రయమౌ విలువైన జ్ఞాన మ
వ్యయముగ నిచ్చు దివ్య విభవాశ్రయ దీప్తుని; జ్ఞానమూర్తియౌ
హయవదనున్; పరాత్పరుని; హార్దిక బౌద్ధిక శక్తిఁగోరి; య-
ధ్యయన మతిన్; దలంతు; వరదా! రఘురామ! దయాబ్ధి
చంద్రమా! ౧౩

(అంబాత్రయము)

కడలికి ముద్దు బిడ్డయిన; కల్మల మేల్దొరసానియౌ సిరిన్;
కడు తెలివిన్ ఘటించు సిరికౌనన జాలిన కోడలమ్మ; నే
ర్పడఁదగు కూడుగుడ్డ నిడు పర్వతరాయని మేల్మిపట్టి; నె
య్యెడల దలంచి కొల్తు; నృహరీ! రఘురామ! దయాబ్ధి
చంద్రమా! ౧౪

(రమ్యజామాతముని)

శ్రీలిడు రామసోదరుని శ్రీపదముల్ మది గల్గియున్న; శ్రీ
శైల నివాసుడైన హరి సత్కృపకెల్లెడ పాత్రుఁడైన; ప్ర
జ్ఞాలలితున్; ప్రపన్న జన సన్నుతునిన్; మనవాళయోగినిన్;
శ్రీలిడ వేడి; నిన్గొలుతు; శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౫

(ఆచార్యపరంపర)

శ్రీపతిదేవు డాద్యుడుగ; శ్రేష్ఠులు నాథమునీంద్ర యామునుల్
దాపయి మధ్యమంబలర; దాసహితాఽస్మ దనన్యదేశికుల్
ప్రాపయి యుండ! సత్కృపలు రాజిలు నా గురుముఖ్యవర్యులన్
దీపిత భక్తిఁగొల్తు సుమతీ! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౬

(భూతయోగి)

ఘనమగు భక్తి సత్త్వమిదె గా; ననమూర్తియె నేయి గాగ; చిం
తనతతి వర్తి గాగ! వితతంబగు జ్ఞానమె జ్యోతి గాగ; శ్రీ
శునికి నివాళి నిచ్చి మధుసూదను గాంచిన భూతయోగినేఁ
దనర నుతించి; నిన్దలఁచెదన్; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౭

(సరోయోగి)

ప్రమిదగఁజేసి మేదినిని; వార్నిధి తోయము దైల మొప్పగా
నమరిచి; భాస్కరోరుకిరణాళిని వర్తిగఁజేసి! జ్యోతిగా
కమలహితున్ ఘటించి; హరికౌ శుభహారతి నిచ్చినట్టి; యా
స్థిమిత సరోమునిన్ దలతు, శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౮

(మహాయోగి)

భూత సరోజ యోగులు[1] నమోఘపు మంగళ హారతివ్వ; నే
నై తగ శ్రీ సతీమణి; ననన్య కృపామతియైన శ్రీహరిన్;
ఖ్యాత రథాంగ శంఖములఁ గాంచి తరించితి నన్న; కైరవ
శ్రీతతి జాతుఁ గొల్చెదను; శ్రీ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౯

(విష్ణుచిత్తులు)

శ్రీరమణీయ పాండ్య నగరేశ్వర వల్లభరాయ సత్సభన్
ధారుణి యెల్ల వెల్గ పరతత్త్వముఁ జాటి తదీయ శుల్కమున్
శ్రీ రమణీశు సత్కృపలఁ జేకొని వచ్చిన విష్ణుచిత్తులన్
చేరిచి మన్మదిన్; దలతు శ్రీ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౦

(గోదాదేవి)

శ్రీ వసుధాంశ మొప్ప; తులసీవనజాతయి; విష్ణుచిత్త సం
భావన గల్గి; భట్టపతి పావన పుత్రికయై రమాపతిన్
దేవుని భక్తిఁ దా ముడిచి తీసిన మాలల గొల్చివెల్గు గో
దా విదుషిన్ నుతింతు; వరదా! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౧

(భక్తిసారులు)

శ్రీశ సుదర్శనాంశజుని; శ్రీ భృగుమౌని తనూజుఁడైన జ్ఞా
నాశయ చిత్తునిన్; గుణగణాశ్రయ సద్విధి శక్తి యుక్తునిన్;
నాశిత షడ్రిపున్; హరిగుణాస్పద మానస భక్తిసారులన్;
నే శరణంచు గొల్తు; సుగుణీ! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౨

(కులశేఖరులు)

కేరళ కోళి సత్పురిన కీర్తిల బుట్టిన కౌస్తుభాంశజున్;
శ్రీరమణీయ భానుకులశేఖర రాజఋషిన్; ప్రపన్ననిన్;
శ్రీరఘునాథ గాథ నెదఁజేర్చిన వానిని; రంగయాత్రికున్;
తీరని భక్తిఁ గొల్చెద విధిన్; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౩

---

1. నమోఘపు హారతి యిచ్చుచుండ

(యోగివాహనుడు)

శ్రీరమణీయ రంగపతి సేవల మున్గి తదీయ కీర్తినే
చేరిచి వీణపై; మిగులఁ జెల్వము మీరఁగ పాడి యాడుచున్;
పేరిమి నిందిరేశు గని వెల్గు ప్రపన్నుని; యోగివాహనున్;
మీరిన భక్తిఁ గొల్చెదఁ దమిన్; రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨

(భక్తాంఘ్రిరేణువు-విప్రనారాయణులు)

అల పర వాసుదేవునిగ నాత్మన రంగపతిన్ దలంచి; శ్రీ
శుల వనమాలికాంశజుడు; శోభలగూర్చు ప్రబోధగీతముల్;
చెలువము మీర పాడి; హరిసేవ లొనర్చిన భక్త పాద స
జ్జలజ పరాగు; నెంచెద వెసన్; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨

(పరకాలురు)

ఇలఁ జెలువారు భక్త తతి నేలఁ: జతుష్కవితావిశేషతన్
గలిగిన షట్ప్రిబంధముల కర్మలతావళిద్రెళ్ళ వ్రాసి; యీ
కలియుగ దుష్కలిన్ దరుమగల్గిన సత్కవిలోకభాస్కరున్;
అల పరకాలుఁ గొల్తు ననఘా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౬

(శఠకోపులు)

మా మహితాన్వయాభరణ మాన్యుల కెవ్వని పాదపద్మముల్;
క్షేమముఁ బెంపు సొంపిడునొ; శ్రీ పితరుల్ దయితాత్మజాది కే
ధామమొ యే మదీయ కులదైవమొ; నా వకుళైక భూషణున్;
నే మదినెంచి; కీర్తిలెద నిన్; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨

(రామానుజులు)

త్రివిధములైన తత్వముల దెల్పిన శ్రీ ప్రణవైక శోభితున్;
నవవిధ భక్తి తత్పరుని; నవ్యకషాయిత ఖండ చేలునిన్;
త్రి విహిత దండమండితుని; ధీరుని; ఖండితవాది వాదనున్;
ధ్రువమతి నీయతీంద్రుఁ, గొలుతున్; రఘురామ! దయాబ్ధి
చంద్రమా! ౨౮

(మధురకవి)

రాగము తాళముల్ గలిగి రక్తిన తీయని తేనెకైతలన్
బాగుగఁ జెప్పువానిఁ; శఠవైరి పదాంబుజ సక్త చిత్తునిన్
శ్రీ గణనాయకాంశజుని శ్రీ మధురైక కవిన్ నుతించి మీ
శ్రీ గుణరాశి నెన్నెదను; శ్రీ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౯

(యామున ముని)

శ్రీపతియోగిరాజు శ్రితసేవ్యుడు మేటి ప్రపన్నకోటికే
ప్రాపయి యుండునట్లు; విభవాస్పదమైన సురద్రుమంబుగా
దాపగు వేదశాఖలను దాల్మిన స్తోత్రముఁగాగఁజేసె; నా
తాపసి; యామునున్; దలచెదన్; రఘురామ! దయాబ్ధి
చంద్రమా! ౩౦

(వ్యాసపరశభట్టరులు)

మా పతియైన రంగపతి మానస పుత్రులు; తత్వపారగుల్
ఆపతి కొల్వునందలరు వ్యాసపరాశర భట్టరార్యులౌ
మా పరమైక దేశికుల మాన్యుల కాద్యులు; మూలపూరుషుల్;
దీపిల వారి నెన్నెద మదిన్ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౧

(భాగవతోత్తములు)

సిగయును; జన్నిదంబు; తులసీ వనమాలయు; నూర్ధ్వపుండ్రముల్;
తగిన రథాంగ శంఖముల తప్తపు చిన్నెలు; నామగీతి; యిం
పుగఁ దనరారు వైష్ణవ విభూషిత భాగవతోత్తమార్యులన్;
దగ నుతి జేసి నిన్గొలచెదన్, రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౨

(మాతాపితరులు)

లాలిత సాధువర్తన విలక్షణులౌ నలదీగ వంశ స
చ్ఛీలురఁ జూడమా నృహరి శిష్ట విచారుల రాజరాజగో
పాల పదాబ్జ సేవకుల; భక్తిన నెమ్మది సంస్తుతించి; న
న్నేల నతించి వేడితిని నిన్; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౩

(ప్రాచార్యులు)

పూత లసన్మ్కుడుంబ కులభూషణులౌ పురుషోత్తమార్యులన్;
ఖ్యాత చరిత్రపాత్రులగు కర్మలవిత్రుల దేశికార్యులన్;
ఆతత వేద శాస్త్రపరులైన గురూత్తములన్; నుతించి నిన్
చేతము విప్పి గొల్చెదను; శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౪

(బంధుహితాదులు)

అనఘులు నైన బాంధవుల నాదరణీయ హితాప్తమిత్రులన్
వినుత సహోదరావళిని విజ్ఞ కళత్ర పవిత్ర సంతతిన్
మన మలరంగ తద్ధితము మాన్పక వారికి సత్కృతజ్ఞతల్
తనర వచించి నిన్గొలిచెదన్, రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౫

(సంస్కృత కవులు)

శ్రీ కమనీయ రామకథఁ జెన్నలరన్ కవితాద్రుమశాఖిపై
కోకిలయై సుధల్ గురియ గూరిమి బాడుచు నాద్యుడైన వా
ల్మీకిని; వ్యాస భాస కవిమేరువు లాదిగ కాళిదాసులన్;
[1]చేకొని యాత్మ నిన్గొలుతు శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౬

(ఆంధ్రకవులు)

నన్నయ తిక్క నెఱ్ఱనల నాచనసోముల నన్నెచోడ సో
మన్నల; పోతనార్యులను; మాన్యుల శ్రీకవిసార్వభౌములన్
పన్నుగఁ బెద్దనాదులను; భాసిలు నేటి కవీంద్రరాశినే
నెన్ని యెదన్; వచించెదను నిన్; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౭

(మరిజ్గంటికవులు)

కంటకితంబు లేని యనఘంబగు సత్కవితాప్రవాహదీ
ప్తంటిన పాండితీ గరిమధాటిగ సాగిన ధీరులౌ మరిం
గంటి కవీంద్రులన్ గొలిచి; కల్మషమూడ్చెడి నీ పదాల నే
నంటి చరింపఁగోల్తు మతినై; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౮

1. ప్రాకట మొప్ప గొల్చెదనురా!

(అమరవాణి)

భారతభారతీ గరిమ భాసిలు బాసల తల్లినాత్మ సం
స్కారపు నాగరీకతలు సభ్యత సంస్కృతి సచ్చరిత్ర లా
చార విచారధర్మవిధి సాగిన శ్రీ సురవాఙ్మతల్లి నే
చేరి నుతించి నిన్గొలుతు; శ్రీ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౩౯

(తెలుగుతల్లి)

జిలిబిలి ముద్దులొల్కు పలు చెల్వము లూరెడు మేల్మి పోకడౌ
పలుకుల నీను దేశముల బాసలలో గడు లెన్సయైన తే
నెలు చవులూర జాలువడి నిండిన తేట తెనుంగు బాసయై
చెలంగిన తల్లినే తలతు; శ్రీ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౪౦

(శ్రీరామ పరివారము)

నిన్ననిశంబెదన్ దలచి; నీ హృదయేశ్వరి జానకీసతిన్;
మన్ననc గన్న లక్ష్మణుని; మారుతి భక్తుని: నీ పదంబులన్
సన్నుతిగన్న కింకరుల సంస్తుతిcజేసి ప్రపత్తిcగల్గి మి
మ్మెన్ని వచింతు దోడిడు దమిన్; రఘురామ! దయాబ్ధి
చంద్రమా! ౪౧

(యామున మౌని)

శ్రీ మహిజాహృదబ్జ వివశీకృత మోహనరాజహంసుడౌ
స్వామిని; లోకరక్షకుని; సర్వజగద్ధిత మంగళప్రదున్;
సామవినోదమానసుని; జాటిన యామున మౌనిగొల్చి; నిన్
క్షేమముcగూర్ప వేడెదను; శ్రీ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౪౨

(శుభకామన)

మాధవ! తావకీనులగు మాకును మీకు గలట్టి నిత్యస
[1]త్యాదరణీయ ప్రేమలకు; త్వల్లలితోద్యదురస్థ లక్ష్మికిన్
మీదగు చాపబాణముల మేలిమి సంపదకున్ శుభంబులౌ;
మీ దయcగోరు నన్నుగనుమీ! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౪౩

---

1. సత్యాదరమైన ప్రేమలకు.

(వేడుకోలు)

ఖ్యాతిగ నీకథన్ మదపికంబయి పాడిన సంస్కృతీయ ప్రా
చేతసుఁగాను; వ్యాసమునిశేఖర సత్కవికాళిదాస వి
ఖ్యాతులఁ బోలలేను; కనగా భవదంఘ్రుల నమ్మి పల్కెద
య్యా! తగఁబల్కఁజేయుము దయన్; రఘురామ! దయాబ్ధి
చంద్రమా! ౪౪

ఘనతర సత్ప్రసన్న కథ గల్గిన సార్థహితోక్తివేదులౌ
వినుతుల నన్నయాదుల కవీంద్రుల వాక్కును గాను, పోతనా
ర్యుని సహజైక సూక్తిసుధ యోగ్యత గానను; నీ పదంబులం
దనిశము నిల్చువాడ వరదా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౪౫

భువనము నెల్ల పత్రముఁగ బూని; మషీరస మొప్ప నబ్ధులే;
అవని ధరాఽధిరాజమును నద్భుతలేఖినిఁ జేసి; శేషుడే
వివరణజేసి చెప్ప విధి వేడ్కను నిన్ లిఖియింపలేడు; నే
నవశుడ వ్రాతునెట్లు కనినన్, రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౪౬

నాయెద కాగితంబుగను! నాదగు బుద్ధి కలంబుగాగ; నా
ప్యాయత భక్తి భావ వినయంబు మషీరసమొప్ప; మీపయిన్
ధ్యేయము నిల్పి వ్రాతు భవదీయ నుతుల్, పలుకున్నకొద్ది నీ
సాయ మొసంగి పల్కెడు వెసన్; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౪౭

నా మదియందు నిల్చి నను నర్మిలి బల్కగ జేయ బూనినన్
నేమము గల్గి నిన్బలుక నేర్చెద; నేన నిమిత్తమాత్రుడన్
క్షేమము గూర్చు నిన్బలికి చెచ్చెర నీ భవ వార్ధి దాటెదన్
నే మది నన్యమెంచను గుణీ! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౪౮

నీ తరుణాంబుజాంఘ్రులను నెమ్మది నమ్మినవాడ; స్వామి! ని-
ర్హేతుక జాయమాన కృప లేపయినిండిన నీదు చూడ్కులన్
చేతనునైన నా పయిన జెల్మినఁ బారఁగఁజేసి యీ కృతిన్
ఖ్యాతిగ సాగజేయు మనఘా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౪౯

అందున కూతకట్టియె సహాయమొనర్చును త్రోవసాగగా
ముందున నుండునట్లు; తమిఁబూనుచు మీ కరుణైకవాహినిన్
రందుల గ్రుంగు నా పయిన రక్షణ సేయగ సాగఁజేయు మా-
నందుడనై; నుతింతు మతినై; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౦

నిరుపమ మాధురీ మహిమ నిండిన నీ గుణ నామ కీర్తనల్
పరమ పవిత్ర భావమున పాడిన వ్రాసిన జన్మజన్మలం
బెరిగిన పాపసంతతులు వీడి పెరిల్లని త్రెళ్ళు నంచు నీ
చిరు కృతి వ్రాతు నీ కృపన, శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౧

శ్రీలలితేంద్ర నీలమణి శేఖర రమ్యతనూ! లసత్కృపా
లాలిత పుండరీక దళ లక్షణ మంజుల నేత్ర! భక్త సం
పాలన తత్పరా! వినుత భక్త సురద్రుమ! బ్రోవరావయా!
శీల హితాలవాలపుర శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౨

నే నెటులింత నిన్బలుక నేర్వ నశక్తుడ నోరి మింతగా
లేని వికారచిత్తుడను, లేశమె నీ కృప గల్గియున్నచో
నే నెఱిగున్నతీరు నిను నింతగ సంస్తుతిఁ జేతునయ్య! రా
మా! నతినైతి నన్ను గనుమా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౩

చక్కదనాల తండ్రి! యెకసక్కెములాడకు; చింతవంతలం
జిక్కి తపించి దిక్కరి విశీర్ణుడనై దరిదాపులేక నిన్
దిక్కని చేరుకుంటి; కడు దీనుడ! నే శరణంటి నిన్ను, నీ
చక్కడి బ్రోవరాగదె! వెసన్ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౪

# క్షేత్ర దర్శనము

## ద్వితీయ స్తబకము

శ్రీలలితాంతరంగ సర
సీరుహ సుందర చంచరీకమా!
లాలిత నీలలోహిత వి
లక్షణ నీరద నీల దేహమా!
పాలిత సాధు భక్తజన
వైభవమా! కరుణాలలామ! అ
ల్వాలపురాభిరామ! భగవ
ద్రఘురామ! దయాబ్ధిచంద్రమా!

కంటిని యంద చందముల కట్టడముల్ గులుకాడు చున్న మి
న్నంటగఁ జూచు సౌధముల నాణ్యతలే కనువిందు గొల్పి పెం
పంటు శుభాలవాలపుర భాగ్య మహోదయమైన శ్రీల న
న్నింటిని ప్రాత మేల్మి జిగి నిండిన పైడిదనాల సీమలన్.

గంటిని; సాధు సభ్యతలు గల్గిన చక్కని సంస్కృతీత్వ మే
పంటిని ధర్మ తత్పరుల పౌర జనంబుల ధర్మ శీలతల్
కుంటులు లేక యున్న విధి కోవిదులౌ సుకృతాత్మదీప్తి న
న్నింటన మిన్నలై వెలిగి నిల్చిన పెద్దల జ్ఞాన వృద్ధులన్.

గంటిని దైవభక్తి చెలగం గల భక్తజనాళి నెల్ల; వె
న్వెంటనె తాత్త్వికోత్తముల విజ్ఞ జనాదరణీయ మైన ని
ష్కంటక చిత్త వృత్తి గల సజ్జన పాత్రుల సత్ప్రపన్న దీ
ప్తంటిన వైష్ణవ ద్విజుల పండిత మాన్య హితాళి నెల్ల నే -

గంటిని; సత్ప్రజాఽవనతఁ గల్గిన నాయక రాడ్విశిష్టులన్
పంటలు పండ జేయు కృషి పండితులన్ వణి గ్గైక వృత్తి పెం
పంటిన ధర్మ శీలతలు వాదని విజ్ఞుల వైశ్య కోటి న
న్నింటిన సర్వ కర్మ పరిణీతుల శ్రీహరి పాద దాసులన్. ౪

గంటిని; శ్రీదరూరి సుభగాన్వయ రమ్య విశిష్ట రత్న దీ
ప్తంటులు వార జేయు గుణ తత్పర శీలురు ధర్మ మార్గ మం
దంటి చరించు వారు వినుతాగమ వేద్యులు సత్ప్రపన్న ప్రీ
తంటిన వారు శ్రీనృహరి ధార్మిక కృష్ణ లనంత వర్యులన్. ౫

గంటికి నింపు పెంపొనరఁ గల్గగ జేసెడి తత్సుతాదులన్;
కంటక భావమున్ గనని ఖండితవాది పరాంకుశార్యులన్;
తంటలు లేని బొంగుకుల ధార్మిక దాతలు రామచంద్రులన్
ఇంటికి వెల్గు నిచ్చు నరసింహుల రాయలు తత్సుతాదులన్ ౬

గంటిని; శ్రీరఘూత్తముని కంజ మనోజ్ఞ పదాలసేవ ము
క్తంటగఁ జేయు వారల నుదారుల రాముని యర్చకార్యులన్
మంటప గోపురాది హరి మందిర సుందర దివ్యసీమ పెం
పంటి వెలుంగు తీరులను; భక్త జనాళిని సత్ప్రపన్నులన్. ౭

గంటిని; రామ! మీ చరణ కాంచన నీరజ యుగ్మమున్; జగ
త్కంటకు లైన రక్కసుల కంఠ విలుంఠన వధ్యశైల దీ
ప్తంటిన సక్థులన్; మిగుల దార్ఢ్యత గల్గు మృగేంద్ర సత్కటిన్
అంటుకొనుండి వెల్గెడి యజాండ హితోదర రమ్య శోభలన్. ౮

గంటిని; శ్రీసతీ ధరణికాంతల భవ్య నివాస వక్ష మం
దంటి వెలుంగు కౌస్తుభ పథంబున శ్రీ శుభవత్స చిహ్నమం
దంటిన శోభలన్; మహిత దార్ఢ్య తరార్గళ దీర్ఘబాహు సౌ
రంటిన క్షాత్ర ధీరతల రంజిలు బాణ శరాసనంబులన్. ౯

గంటిని; వైజయంతికయె కంఠ సుశోభలఁ జాటు వైన మిం
పంటగ; మోవి సీమన శుభంకర సుస్మిత మౌక్తికాళి జా
లంటుచు దొర్ల; నున్నతపు లక్షణమౌ తిల నాస దీప్తి సొం
పంటుచు గూడి నట్టి సితపంకజ రమ్య విశాల కాంతులే - ౧౦

జంటగ నున్న కన్నుల పసందులఁ బెంచ; లలాటసీమ యం
దంటిన నూర్ధ్వ పుండ్రముల ధాటిని; సత్కుటిలాలకాల గు
ల్కంటిన మోము చంద్రుని విలక్షణ రమ్యపు దివ్యకాంతి జా
లంటుచు నింద్ర నీల శకలాళి సమాన కచాళి రమ్యతన్. ౧౧

గంటి; నవైక రత్న తతి గల్గిన కాంచన మౌళి మస్తకం
బంటి వెలుంగ పచ్చనగు పట్టు దుకూలము గుల్కు సత్కటిన్
గంటిని; శేషి శేషతలు గల్గిన లక్ష్మణ సూరి వర్యునిన్;
జంటన చక్కనౌ పుడమి చల్లని తల్లి వరాల ముద్దు లిం - ౧౨

పంటిన మూటయై తనరి భక్తులఁ గావగఁ జేయు తల్లియై
యంటి వెలుంగుచున్న వినయాన్వితయౌ మిథిలేశు పట్టి నే
గంటిని; మారుతాత్మజుని కర్మ లవిత్రుని భక్త సంతతిన్
కంటకమైన సంకటము ఖండన జేయుచు బ్రోచు వానినిన్. ౧౩

గంటిని; సత్య ధర్మ నయ గర్విత దిగ్విజయైక దీక్ష ని
ష్కంటక శక్తితో వెలుగ; షడ్వికృతాఽరి బల ప్రగల్భ శ
క్తంటిన దూర్త దైత్య ఖల ఘాతుక సంతతి కంఠ లుంఠ నో
త్కంటకి తోగ్ర రూక్ష మగు కార్ముక బాణ కరాబ్జ శోభలం ౧౪

గంటిని; యాశ్రితార్తతతిఁ గావగ వెల్గు కృపామృతమ్ము తే
పంటి స్రవించి సాగెడనవద్య సితాబ్జ మనోజ్ఞ దృక్తతిన్
గంటిని; దివ్య వాక్తతుల కందని త్వచ్చరణాఽగతాఽవనం
బంటిన మానసాబ్జమున భాసిలు వత్సలతా గుణాదులన్. ౧౫

గంటిని; మౌని మాన్య జన కాంత హృదంబుజ ముగ్ధ మోహ ని
ష్కంటక మారకోటి నుత సాత్విక సుందర దివ్య మంగళం
బంటిన మీ స్వరూపమును; భక్త హితంకర సత్య దీక్ష పెం
పంటిన మార్దవార్ద్రిత మ వత్సలతాఽకృతి గల్గు మిమ్ము నే ౧౬

గంటిని; తల్లి దండ్రి సుత కాంత హితాప్తులు బాంధవాళి నా
కంటిల మీరు తప్ప నిల గల్గరు నన్యులు; దేహబాంధవుల్
కంటకులైన నైహిక సుఖార్థులు నర్థహితాఽర్థలంపటుల్
కంటిన గల్గు[1] నెర్సులయి గల్గిన వారని నమ్మి కృంగి నీ ౧౭

కంటె జగాన రక్షకుడు గాంచగ నన్యుడు లేడటంచు నా
కంటిల నీ పద ద్వయమె కల్గిన దాపని చేరుకుంటి; న
న్నంటిన దోష మూడ శరణంటిని నన్ దరి జేర్చి బ్రోవ ర
మ్మంటిని దిక్కుఁయుంటి నను మానము వీడి ఘటించు నీ కృపన్. ౧౮

పంటికి పుప్పి నొప్పి వలె ప్రక్కన బల్లెమువోలె షడ్రిపుల్
కంటక వృత్తులై తగవు గల్గిరి; దుర్విషయేషణ త్రయం
బంటిన జల్గ యయ్యే బలువౌ చిల తాపము లైన మూడు న
న్నంటుచు మంట బెట్టె గన నైతివ నావ్యద చింత వంత ల ౧౯

న్నింటిని; వ్యాధి యాధులును నిర్వివరంబులు లేని బాధనే
యంటికొనుండఁ జేసె; నసహాయుడనై పెర దిక్కుఁలేక నే
యుంటిని; నీవె దిక్కనుచు నోర్వని బాధకు కంటి నింద నీ
రంటగ వెక్కి వెక్కి కడు రందుల నేడ్చితి; తాళలేక వే ౨౦

1. నల్సు.

డొ్కంటిని నిన్ను; నార్త జన కోటికి రక్షణ నిచ్చు వాడ వీ
వంటిని; దిక్కు లేని శ్రిత భక్తుల కీవిల దిక్కటంటి; న
న్నంటిన పాప మూడ్చ శరణంటిని సర్వము వీడి తంటి; ర
మ్మంటిని కావు మంటిని సుమా! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౧

ఆర్త జనాఽవనైక కరుణారస పూర్ణ హితాంతరంగమా!
కీర్తిత విశ్వధామ! శ్రుతి గీతివిశేష నుత స్వరూపమా!
దూర్త గుణాఽసురీయ ఖల దుర్జన దైత్య విరామ! రామ! భ
క్తాఽర్తి హరైక నామ! వరదా! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౨

—: ౦ :—

# క్షేత్రమహిమ

## తృతీయ స్తబకము

శ్రీ సిత పద్మ లోచన! వి
　　శేష మనోజ్ఞ కృపాఽఽయతేక్షణా!
భాసుర సత్య కామ! రవి వం
　　శ సుధాంబుధి పూర్ణ సోమ! సీ
తా సుకుమార మానస హి
　　తంకర సుందర రాజ హంసమా!
శ్రీ సుకృతాఽఽలవాల పుర
　　శ్రీ రఘురామ! దయాబ్ధి చంద్రమా!

శ్రీలకు నాలవాలమయి చెన్నలరారెడు భద్ర సీమ! యె
వ్వేళల నైన సంస్కృతియు విజ్ఞత సభ్యత సాధు వర్తనల్
లీలగ సాగు నేల; వెల లింతన రానివి దైవచింతనల్
గ్రాలగ వెల్గు నిందుఁ గనగా; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧

తగిన భుజమ్ములం దొనర తప్త సుదర్శన పాంచజన్యముల్;
సొగసగు నూర్ధ్వపుండ్రములు శోభిల ఫాలము నందు; వాక్కునన్
నగధరు నామ గీతి; నళినాక్షపు మాలలు కంఠమందు; నొ
ప్పగ హరి భక్తు లుందు రిట పావనరామ! దయాబ్ధి చంద్రమా! ౨

ఇహ పర సౌఖ్య సంపదల నిచ్చెడి శ్రీహరి మంత్ర రాజమున్
మహిత ప్రపన్న తా హృదిఁ దమిం జపియించెడి భక్తు లెల్లరున్;
బహువిధ సేవలన్; వినయ భావముతో నొనరించి మిమ్ములన్;
స్మహనము మీర గాంత్రు మనస్సై; రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౩

పరమ దరూరి వంశజులు; భవ్య చరిత్ర పవిత్రు లైన స
ద్గురులు; నృహ ర్యనంత గుణ గుంభిత కృష్ణ గురూత్తమార్చకుల్;
సరసులు తత్తనూజు లిట చక్కని భక్తిన మిమ్ముగొల్చి; సు
స్థిరత వెలుంగుచుందు రిట, శ్రీరఘురామ! దయాబ్ధి చంద్రమా! ४

విష్ణు పదైక చింతనులు; విజ్ఞులు, యోగ్య నృహ ర్యనంత శ్రీ
కృష్ణ వరార్చకార్యులగు గేస్తులు; భక్త పరాంకుశార్య రో
చిష్ణులు; నాది భక్త జన శేఖరు లిచ్చట మిమ్ము ధర్మ వ
ర్ధిష్ణులు నౌచ గొల్తు రిట; శ్రీరఘురామ! దయాబ్ధి చంద్రమా! ౫

శ్రీయుత బొంగు వంశ జులు శ్రేష్ఠులు భక్తులు రామచంద్రులౌ
రాయలు; శ్రీనృసింహ వర రాయలు నాది పవిత్ర ధార్మికా
ధ్యాయులు; తత్కుటుంబినులు; తత్తనయాప్తులు; మీ పదంబులే
ధ్యేయ మటంచు గొల్తురు విధిన్; రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౬

బంగరు వంశ వర్ధనపు భవ్య మనోజ్ఞ గుణ ప్రశస్తి చే
బొంగు కులార్ణవంబుఁ గడుఁ బొంగగ జేయు శశాంకులౌచు; వా
సింగను రామచంద్ర నరసింహుల రాయలు నాది సోదరుల్
సంగతిఁ దత్కళత్రహిత సాధు సుతాఽవళి; మిమ్ము గొల్చి మీ
యింగిత మొంది వెల్గిరి హరీ! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౭

మీరిట మందిరమ్మునఁ దమిం గలిగుండగ నీ పురమ్మె శృం
గార వికుంఠ సత్పురమె గా! యిటఁ గల్గిన నర్చకాదులే
సూరులు; నిత్యసూరులు; యశోజ్జ్వల వైష్ణవ కింకరుల్ ప్రజల్;
శ్రీరమణుండ వీవె గద! శ్రీరఘురామ! దయాబ్ధి చంద్రమా! ౮

భూమిజ లక్ష్మి గాగ; చెలువొందలువాల; వికుంఠ సీమగా;
ప్రేమన నిన్ను గొల్చు ప్రజ విజ్ఞులునౌ హరి సేవకాళి గా;
నీ మహితాలయమ్ము సుర నిర్మిత దివ్య గృహమ్ము గాగ; మీ
ర్రే మురవైరి యై తిరిట శ్రీరఘురామ! దయాబ్ధి చంద్రమా! ౯

ఎచ్చట మీరు నిల్చెదరొ? యేర్పడ నచ్చటె సర్వ దేవతల్
హెచ్చు చరింత్రు దుర్విషయ హేయతలన్ బరిమార్చి వేయుచున్
నచ్చటి సాధు సజ్జనుల నర్మిలి బ్రోతురు; మీ కృపాధునుల్
నిచ్చలు పారుచుం డిచటనే రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౦

కలియుగ మందు సజ్జనుల గావగ; దుర్జన జాతి నూడ్చ గా
కలిని నడంచ నంతట జగద్ధిత రూపము తీరు తీరు గా
వెలసి త్వదీయమౌ మహిమ విస్తృతిఁ జేసె గదయ్య! అవ్విధిన్
జెలఁగె త్వదీయ రూప మిట; శ్రీ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౧

తరగని మీ కృపారసము ధాటిగ వెల్లువ లౌచు పారగా;
వెరవక సాధు సంఘములు; విష్ణు హితంకర కింకరాళి; శ్రీ
కిరవయి వెల్గి దుర్జనుల కీడుకు లొంగ కజేయు లైరి; మీ
స్థిరమగు సత్కృపల్ గలుగ శ్రీరఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౨

చక్కదనాలతండ్రి! భవ సాగర బంధిత లోక మెల్ల ని
న్నిక్కడఁ గాంచి నీ చరణ నీరజ సేవల గల్గి భక్తితో
ధిక్కృతితో భవాంబుధిని దెల్వివ మున్గక నీదు సేవలో
చక్కగ నుండు నెప్డు మనసై; రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౩

కలియుగమందు పాపములఁ గానకఁ గాంచియు కల్గియున్న పా
పులఁ గడతేర్చ నెంచనిటఁ బూని దయా రస పుణ్యమూర్తులై
వెలయుకతాన పాపముల వీడి; త్వదీయ పవిత్ర సేవలం
జెలఁగి తరింత్రు సజ్జనులు; శ్రీరఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౪

జ్ఞానులు; జ్ఞాన హీనులు; నసహ్య మతుల్ మఱి యెవ్వరైన దా
సీనివహంబులైన; నిట స్థావర జంగమ తిర్యగాదియే
[illegible]. నీ పదాబ్జముల నర్మిలి నిత్యము సేవ గల్గి నీ
రింత్రు మనసై; రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౫

బొంగు కులాబ్ధి చంద్రులగు పూర్వులు నెవ్వరో మందిరమ్ముౘ స
త్సంగతి నిల్పి మిమ్మచట సాగ ప్రతిష్ఠ నొనర్చి ధన్యులై
యింగిత వంతులైరి; తరియించిరి మీ పరిచర్య జేసి; ని
స్సంగులు యోగ్యులైరి, తలఁచన్; రఘురామ! దయాబ్ధి
చంద్రమా! ౧౬

సులలిత ధర్మ తత్పరులు సూనృత వాగ్గరిమా మనోహరుల్
అలఘులు శ్రీ దరూరి లలితాన్వయ రత్నము లీన్పృహర్యనం
తులు గన వీరి పూర్వులు హితుల్ గురువుల్ గద బొంగువారికిన్;
చెలిమిన గొల్తురి వారు మిము, శ్రీరఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౭

హితులు పరాంకుశార్యులు సహిష్ణులు భాగవతార్య సూరు లా
తత గుణ కీర్తనీయ హరి దాసులు; తావక నిత్య కింకరుల్
సతతము మీ గుణానుభవ సంపద గల్గి త్వదీయ సేవకే
స్థితి గలిగించి వెల్గి రిట; శ్రీ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౮

మీ కరుణా కటాక్షములు మేరలు దాటుచు భక్త కోటులన్
సాకత గల్గి యుండ కృప సాగగ; నిచ్చటి వార లెప్పుడున్
నాక సుఖాలె కాక పలు సంపద లందుచు దృప్తి నుంద్రు స్వా
మీ! కనుగొంద్రు మిమ్ము చెలుమిన్;రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౯

ఎంతగ పూర్వ జన్మముల నేర్పడఁ జేసిన పుణ్య సంపదల్
ఇంతగ వ్యర్థ మొందక ఫలించగ గల్గిరి మాన్యులిందు, దు-
స్సంతమసం బడంగ తమ సన్నిది నుండి తరింత్రు మీ కృపా
త్యాంత దృగబ్జముల్ తనరగా; రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౦

నచ్చిన వాదవంచుచు న నన్యకృపామతి వీవటంచు న
య్యొచ్చిన వాదవంచు; నిను నోరిమి కూరిమి పెంపు మీరగా
నచ్చపు భక్తి భావమున నర్చన జేసి తరింత్రు భక్తు లిం
పచ్చగ వెల్గ తావకకృపల్ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౧

శ్రీరమయైన సీత; కడు చెల్వము లీనగఁ బ్రక్క నిల్వగన్;
సూరి వరార్య లక్ష్మణుడు; సుందరుడై ప్రకటింప శేషతన్;
మారుతి పాద సేవ నిడ; మంజుల సత్కరుణాపయోధులై
మీరిట వెల్గ గాంచితి దమిన్; రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౨

చక్కని యోర చూపు దొరసానయి సీతమ తల్లి ప్రక్కనన్
చొక్కపు మక్కువల్ మిగుల సొంపులు గుల్కెడి నవ్వ మొగ్గలన్
నిక్కగ జేసి మీ చలువ నీడల నిల్వగ; బేర్మి చూడ్కలే
చిక్కగ వెల్గు సామి విట, శ్రీరఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౩

బంగరు వల్వ సొంపలర; బల్ సొగసీనగ నిల్వు నామముల్
రంగుగ రాలు దాపిన తురాయది కల్కితనమ్ముఁ జూప; కే
లం గల విల్లు నమ్ములు భళా! యని బీరముఁ జాటి చెప్ప; నో
మంగలిగున్న నిన్గొలుతు; మా రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౪

చల్లని సామి వంచు; మనసైన కృపాఽమృత మైన చూడ్కలన్
జల్లెడి వాఁడ వంచు; కడు చక్కని చొక్కపు నిగ్గుటద్దమౌ
నుల్లము గల్గినావనుచు నోర్మిన భక్తుల రక్ష చేసి రం
జిల్లెద వంచు జేరితిని, శ్రీరఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౫

శ్రీజయరామ! చారు తులసీ దళ శోభిత దివ్య దామ! సీ
తా జలజాఽయతేక్షణ పథాశ్రయ సుస్మిత రమ్య చేతమా!
రాజిత ధర్మ తత్పర పరంతప! రాజఋషీంద్ర! రాజ! రా
రాజ! హితాలవాలపుర రాడ్రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౬

—: ం :—

# వేంలుకొలుపు

## చతుర్థ స్తబకము

శ్రీ రఘు వంశ సోమ! అతసీ
సుమ నీరద నీల సీమ! రా
రా! రమణీయ మానస! ధరా
తనయాహృదయాబ్జ మిత్ర! ధీ
రా! రజనీచరాంతక! పరా
త్పర! శ్రీ నరసింహ! బ్రోవరా!
శ్రీ రుచిరాఒలవాలపుర శ్రీ
రఘురామ! దయాబ్ధి చంద్రమా!

శ్రీ పరిపూత! కోసల నరేశ సుతా వర ర్భ శుక్తి ము
క్తాఫల! రాజరాట్ దశరథాత్మ హితంకర పుత్ర రత్నమా!
దాపయి పూర్వసంధ్య గనుపట్టెను దీర్చర! సాంధ్య కర్మ; లే
రా! పరమాత్మ! మేలుకొనరా! రఘురామ! దయాబ్ధిచంద్రమా!

ధీరవరోత్తమా! వసుమతీ దుహితా ప్రియ రాడ్విభూత్తమా!
చారు తరైక సారస విశాల దళాఒయత రాగ లోచనా!
మారుత తుల్య వేగ ఖగ మంజుల కేతన! విశ్వకారణా!
ధారుణి నేల లేర వరదా! రఘురామ! దయాబ్ధిచంద్రమా!

ఇనకుల చంద్రుడౌ రఘువరేణ్యుని మానస రాజహంసినీ!
జనకుని పూర్వజన్మ కృత పుణ్యతపంబుల పంటలక్ష్మి! స్వా
మిని! సుమతీ సతీజన సమీడిత రూపిణి! లెమ్మటంచు భూ
తనయను లేపినాను వరదా! రఘురామ! దయాబ్ధి చంద్రమా!

జగముల కెల్ల తల్లివయి సాధుజగ ద్విభవాభిరాముడౌ
నగధర ధీరు(డైన నళినాక్షుని రాముని పేరురమ్ము పై
సొగసుల నిద్ర వోవు[1]గుణసుందరి! జానకి! లెమ్మటంచు నీ
మగువను లేపినాను; గనుమా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౪

మిత్ర కులాబ్ధి రాణ్మణీ! తమింగల రాముని సోదరాగ్రణీ!
క్షాత్ర గుణ ప్రశస్త మణీ! శాస్త్ర విదాంవర ధీమణీ! జగ
త్పాత్రప్రపన్నతామణీ! ప్రభాతమిదే! యని లేపినాను సౌ
మిత్రిని; లెమ్ము; మేలుకొనుమీ! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౫

రామ పదారవింద మధురామృత పాన విశేషమత్త చి
త్తాఽమిత సుందరా! హరి పదాశ్రిత సన్నుత రామభక్త! లే
రా! మతిమంత! ప్రాక్సుదతి రాజిలె లెమ్మని లేపితిన్ కపి
స్వామిని; లేర! మేలుకొనవా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౬

శ్రీ రుచిరాంగ! నీ చరణ సేవకు లెల్లరు లేచినారు వం
దారు శ్రితార్త భక్త సుజనావళి నిద్ర( దొలంగె లేవరా!
సారస నేత్ర! లేచి రిట సన్నిహితార్చకు లాది సేవకుల్
చేరిరి స్వామి! మేల్కొనర! శ్రీ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౭

పురమిది లేచె; లేచె గిరిపుంజము; నాగిరి పుంజ గహ్వరాం
తర వర కేసరీంద్రములు ధాటిగ లేచెను; జ్ఞాన లోకమే
వెరవక లేచె; ధీరులును వీర నృసింహులు లేచిరయ్య! సు
స్థిర సుగుణాఢ్య! మేల్కొనర! శ్రీ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౮

శ్రీ రవి వంశ సోమ! సరసీరుహ లోచన చారుసీమ! శృం
గార గుణాభిరామ! త్రిజగన్నుత సత్కరుణాలలామ! సీ
తా రమణీ మణీ హృదయ తామరసైక నట న్మిళిందమా!
లేర! నరోత్తమా! నిదురలే! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౯

---

1. రస.

చూడర! వేగు చుక్కదిగో! సొంపులు గుల్చుచు దోచే తూర్పునన్
వాడల నీడ లందెగయు పక్షుల గుంపులు సవ్వడించెరా!
మోడు పడున్న డెందములు ముద్దుగ హాయిగ బాడుచుండె; క్రీ
నీడలు వాసె లెమ్ము సుగుణీ! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౦

సారస భృంగ ఝుంకృతులు సాగెడు పంట పొలాల శ్రీల మే
ల్పారుల సిగ్గు మొగ్గల పసందులు చుట్టిన రంగనాగరి
శ్రీరుచి గల్గు మీపురిన చెల్వగు మందిర మందు సీతతో
చేరిన సామి! మేల్కొనర! శ్రీ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౧

శ్రీ రఘునాథ! ప్రాక్దిశన చెన్నలరారెను బాల భాస్కరుం
డారెను చిమ్మ చీకటి పటాలము; సాగెను సుప్రభాతముల్
మీరెను సుప్రసన్నమయి మేదిని; జాల్కొనె పద్మినీ సుధల్;
శ్రీ రుచిరాంగ! మేల్కొనర! శ్రీ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౨

దేవత లష్టదిక్పతులు దేశహితుల్ వసుధాధినాయకుల్;
సేవలఁ గోరి మీ గృహపు చెంతన నిన్గన వేచినారు; దే
వా! విలువైన తన్మహిత వాహన ఘంటల నాద మబ్ధిఘో
షావహమయ్యె! మేల్కొను వెసన్ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౩

తావక దాస దాస జన దాసులు దివ్యులు రాజ శేఖరుల్
మీ వివి ధైక సేవలఁ దమిన్ నెరవేర్పగ వేచినారు; మీ
సేవ నొసంగి వారలకు జేకొన దద్విధులెల్లఁ బేర్మితో
శ్రీ వినుతాంగ! మేల్కొనర! శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౪

మల్లెల సౌరభంబుల నమందతఁ గూడుచు పిల్లగాలి తా
జల్లగ గిల్గి లింతలిడి సాగెను; హంసలు పద్మపీధులం
దల్లన నిద్దురన్ దొలగ నాడి విదల్చెను మంచురెక్కలన్;
చల్లని సామి! మేల్కొను వెసన్ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౫

దారుణ ధూర్త దుర్మకర దంష్ట్రికలందునఁ జిక్కుకొన్న నా
ధీర గజేంద్రునిన్ గరుణ దీపిల బ్రోచిన యార్తరక్షకా!
వారిజ నేత్రలైన సురభామలు వేచిరి; మీ సపర్యకై
చేరిరి; మేలుకోగదవె! శ్రీ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౬

అలరెను బాల సూర్య భగవానుడు తూర్పున; దెల్లవారెఁ దా
రలు మరుగయ్యెఁ; నా కలువ రాయడుఁ దా వెలవెల్ల వోయె, తో
టల నును పూల తావులను డాబుగ మోయుచు గాలికూన రా
జిల నసియాడె; మేల్కొనర! శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౭

ఘనమగు దివ్య దీప్తుల చకచ్చకితల్ గల చాపబాణముల్
తనరిన దీర్ఘ బాహువుల దండితనంబుల నొప్పువాడ! వీ
చెను చిరుగాలి పూగవనసీమలఁ బువ్వుల తావి నూని, మే
ల్కొనర! జగాల నేల గదగ౯ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౮

ఆలను మేతకై యడవి కంపుచు వెంటున నంటిసాగు గో
పాలుర వేణు నాదములు; బల్విడి నెద్దుల కంఠ ఘంటికా
జాల నినాదముల్ దెసల సాగుచు దుష్కలి నూడ్చుచుండెరా!
శ్రీ లలితాంగ! మేల్కొనర! శ్రీ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౯

ఎద్దుల మేటి అంకెలకు నేర్పడ భీతి జలేజ గర్భ సం
బద్ధములైన తుమ్మెదలు బల్విడి పర్విడి యాడుచుండె లో
కోద్ధరణార్థమై సురుల గూడి త్రిమూర్తులు వేచినారు; వే
దోద్ధర! మేలుకొమ్ము గొలుతున్ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౦

జగముల నెల్ల నీదు కను సన్నల సాగగ జేయువాడ! శ్రీ
విగ ముని యాగరక్షణముఁ బ్రీతి నొనర్చిన వాడ! దుష్టులౌ
నగణిత లోకకంటక ఘృణాఽసుర ఖండన చండ శౌర్య పా
రగ! రిపుభీమ! మేలుకొనరా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౧

వినతిన వేడి చేరిన విభీషణు సేవల గొన్నసామి! ఈ
వన తరు నీడజంబుల ప్రభాత రవంబులు కొల్లలయ్యె; పా
వనమగు మీపదార్చనలు పర్వెడు వేళలు చేరు వయ్యె; వే
చెను సుజనావళి మేల్కొనర! శ్రీ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౨

మ్రోగెను నీడజంబుల ప్రమోదపు సవ్వడి కర్ణపేయమై
సాగి నిశా వధూటి కడు నన్నగిలెన్; సురకాంత లర్మిలిన్;
మూగిరి మీ పదాబ్జముల పూజలు సేయగ వేచేరయ్య! వే
వేగమె లేర! మేలుకొనవే! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౩

ద్వాదశ సూర్యు లుజ్జ్వల రథంబులతో వసు శర్వు లామరేం
ద్రాదులు షణ్ముఖాదు లరదంబులతో సరి పంక్తిదీర్చి మీ
యాదరణీయ సత్కృపల నందగ సేవ లొనర్ప వేచిరో
శ్రీధర! మేలుకోగదవె! శ్రీ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౪

కిన్నెర యక్ష కింపురుష కీర్తిత గాయకు లశ్వముఖ్య భా
స్వ న్నయశీలురున్ సనకసాదిమునుల్ వరవైణికుల్ జగ
న్మన్నన గన్న యచ్చరలు మాన్యులు వేచిరి దర్శనార్థులై;
సన్నుతగాత్ర! మేల్కొను వెసన్ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౫

స్నాన మొనర్చి సప్తఋషి సంఘము మంగళ వస్తుహస్తయై
జ్ఞాన విశారదుల్ సనకసాదిమునుల్ వరవైణికుల్ సుధా
గాన కళా సరస్వతులు గాంచగ మిమ్మిట వేచి రర్మిలిన్;
శ్రీనుత! మేలుకోగదవె! శ్రీ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౬

గాయక సూరులౌ మునులు; గారుడ కిన్నెర సిద్ధ చారణుల్;
పాయక యోగి వర్యులు కృపామతులౌ తమ సేవఁ గోరి దీ
క్షాయుతులై మృదంగ వరకంజర వీణల మ్రోగ జేసి యా
ప్యాయత గల్గి గీతముల బాడుచు నాడుచు వేచినారు; లే
రా! యిక స్వామి! మేలుకొనరా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౭

కమలము లెల్ల విచ్చినవి, కంజహితుం డుదయించె; కన్నియల్
విమల సరోవరంబుల పవిత్రపు స్నానము లాచరించి, వ
స్త్రములను పిండుకొంచు నిజ ధామములన్ దమి సాగిరయ్య! కూ
రిమి గల సామి! మేల్కొనర! శ్రీ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౮

వేదము నుద్ధరించి; గిరిఁ బేర్మిన మోసి; ధరించి యిమ్మహిన్;
సాధునిఁ బాలు నేలి; బలి చక్కడగించి; హరించి రాజులన్;
ఛేదిల జేసి రావణుని; శ్రీ బలరామ; వ్రజేశ; కల్కి వై
ఈ ధర నేలు నిన్గొలుతు శ్రీ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౯

ఖలులగు దైత్యులన్ దునుమ గల్గిన దోర్బలశాలి! దివ్య దు
జ్జ్వల లలితేంద్ర నీల మణి వర్ణ! శుభంబులు నీకు; మంగళం
బులు పదివేలు; దిగ్విజయముల్; శుభ సంపద లొప్పుగాత! బా
సిలు లలితాఽలవాలపుర శ్రీ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౦

మీకును మాకు నెల్లపుడు మేలగు కూర్మలు పెంపు గావుతన్!
మీ కగు లక్ష్మి భూమిజకు మీ యనుజన్మల కాంజనేయుకున్;
మీకగు [1]వింటి యమ్ములకు మీ భుజ శక్తికి దేహ లక్ష్మికిన్;
మీ కలరున్ శుభంబు లెలమిన్ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౧

శ్రీకర నామ రూప గుణ రీత్యనవద్య విశిష్ట చిత్కళా
శ్రీ కలితోజ్జ్వలాకృతి విశేష మనోహర! విశ్వజి న్మహో
ద్రేక రిపూగ్ర భీతికర దిగ్విజయంకర కార్ము కోన్నతో
త్సేక! హితాఽలవాలపుర శ్రీ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౨

—: ౦ :—

1. విల్లు నమ్ములకు.

శ్రీః

# ప్రపత్తి

## పంచమ స్తబకము

శ్రీ లతికాఽఽకృతిందనరు సీ
　　తమ తల్లి మనోజ్ఞ సీమలో
లీలలఁ దేలి యాడుచు విలీ
　　నములై యలరారి సోకుల
న్దేలిన వేమనోజ్ఞ భవదీ
　　య పదంబులో! వానిఁ గొల్చెదన్;
శ్రీలలితాఽఽలవాలపుర శ్రీ
　　రఘురామ! దయాబ్ధిచంద్రమా!

శ్రీవిభవాఽఽభిరామములు; సేవక సజ్జన తారకంబు లు
ర్వీ వినుతంబు లాశ్రితుల వేడ్కల దీర్చెడి పారిజాతముల్;
శ్రీవసుధాత్మజా హృదయ సేవ్యములౌ భవదంఘ్రులన్ మదిన్
నావని చేరినాను నతినై రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧

హరి హర దిక్పతుల్ సురు లహర్పతి గీష్పతి దేవజాతులున్
పరమ పవిత్ర భావములు భాసిలు యోగులు నిత్యసూరులున్;
స్థిరమతు లేత్వదంఘ్రులనుఁ జేర నుతించిరొ! ఆ త్వదంఘ్రులన్
శరణని చేరినాను మనసై రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨

త్రిభువన పూజనీయములు దివ్య తపోధన చిత్త వేద్య స
ద్విభవము లార్తపీడితుల దీనులఁ గావగ సాగు పెన్నిధుల్;
శుభదము లేత్వదంఘ్రు లిట సూరిహితంబులొ యాత్వదంఘ్రులన్;
ప్రభు! శరణంచు చేరితినిరా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩

నిగమ విధిజ్ఞ వేద్యములు నిర్మల మౌని మనో విహారముల్
తగు విధిఁ గొల్చువారికి సదా నిడులిచ్చెడి కల్పభూజముల్;
అగణిత మంగళాస్పదము లైనవి యెవ్వియొ యాత్వదంఘ్రులన్
తగ శరణంటి బ్రోవు వరదా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౪

నిగమ వనాంతమం దరుగ నెంచిన పాదము లావిధాత వే
డ్కగ గడు భక్తితోఁ గడగ గల్గిన పాదము లా యహల్యకౌ
వగపు నడంచు పాదములు త్వద్ఘన పాదము లంచు వానినే
తగ శరణంటి నయ్య! స్థిరతన్ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౫

ఇంతటి చక్కనైన వని చెప్పగరానివి; తామ్ర గర్భ స
త్కాంతిని మీరి వెల్గునవి; కమ్మని కూర్మిన జానకమ్మ యే
కాంతపు వేళ ముద్దులిడగ గల్గిన వేవియొ! యాత్వదంఘ్రులన్
చెంతకు జేర గోరితిని, శ్రీ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౬

భువన హిత ప్రదంబులయి ముక్తులు నిత్యులు గొల్చుచున్న వై
నవ రస వృత్తి గల్గి యిల నవ్యతచేఁ జెలువౌ త్వదంఘ్రులన్
అవనిజ సీత కూర్మినెద నాదగజేనొ! వాని నెంచి నే
సవినయతన్ నుతింతు మనసై; రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౭

ఆసురబాలు నేలినవి; యా ధ్రువు గాచిన వా యహల్యనే
దోసము నూడ్చి బ్రోచినవి దుర్దనుజాదులఁ ద్రుంచి యజ్ఞమున్
వాసిగ గాచినట్టివయి వర్ధిలు నే భవదంఘ్రు లౌనొ! ఆ
మీ సుకృతాంఘ్రు లెంతును దమిన్ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౮

జనకుడు సీత నర్మిలి నొసంగెడి వేళల గడ్గినట్టి వై
జనకుని యాజ్ఞచే నడవి సాగిన వాగుహు డెంచు పూజలన్
దనరిన వ య్యరణ్యముల దాటిన వేళవదంఘ్రులౌనొ! అ
య్యనఘ పదాల నెంతు నతినై; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౯

ఆగమ దివ్య శైల శిఖరంబులలో; స్మృతి చర్యలందు; కీ
ర్త్యాగత వేదశాఖలఁ బురాణ వనంబుల; శాస్త్ర వీధులన్;
సాగెనొ! యే త్వదీయ పదసారసముల్; మది వాని నర్మిలన్
నేఁ గనఁ జేరినాను సుగుణీ! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౦

భరతుడు; లక్ష్మణుండు; గుహుభక్తుడు; వృద్ధకిరాతనారి యా
దరమున మౌని పుంగవులు; [1]దాసజటాయువు; నాకపుల్ యశో
ధరులు విభీషణాదులు త్వదంఘ్రుల గొల్చి తరించి రా భవ
ద్వర పద యుగ్మమున్ గొలిచెదన్; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౧

శ్రీసతి కోసలాత్మజ సుచిస్మితయై యొడిలోన స్తన్యమున్
ఆ సుతు బాలరామునకు నందిడు వేళల బేర్మి పొంగి బల్
మోసులు వార పాదముల ముద్దిడి ముద్దుల రాముఁగొల్చెనో
ఆ సుతువైన నిన్ గొలిచెదన్, రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౨

శ్రీమహనీయ కోసల నరేశ్వర ! శ్రీకర! సద్గుణేశ్వరా!
సామజ భవ్య సద్గమన! సామ మనోహర గాన లోల! సు
శ్యామశరీర! సాధు పురుషౌఘ హృదబ్జ మనోహరాంగ! రా
మా! మహితాఽలవాలపుర మా రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౩

—: o :—

1. ధర్మ.

శ్రీః

# విన్నపము

## షష్ఠ స్తబకము

శ్రీజగదీశ్వరాఽజ సురశే
ఖర దివ్య కిరీట రత్న సీ
రాజిత పాద పంకజ! నరా
ధిప సన్నుత సేవితాంఘ్రి నీ
రేజ! మనోజ్ఞ రూప జిత శ్రీ
మదనాంగ! కృపానుషంగ! రా
రాజ! నుతాఽలవాలపుర రాట్
రఘురామ! దయాబ్ధి చంద్రమా!

పాపపు దుర్నయత్వములు బల్వడి ధర్మపథాల నెల్ల భూ
స్థాపిత మొప్ప జేసి వివిధంబగు వంచనలందు సజ్జగ
ద్దీపిత సాధు సద్గుణపు తెన్నుల ముంపుచు శాంతి నూడ్చెరా!
దాపని నిన్నె గంటి వరదా! రఘురామ! దయాబ్ధి చంద్రమా!

ధార్మిక దేవతాళి ధరఁ దళ్కడ మందుచు చావు బ్రతుకులో
మర్మములూడ నొప్పివడె; మాన విహీనుల[1] చిత్త వృత్తులున్
దుర్మద మేపుగాంచు కడు ధూర్తుల చేష్టలు పెచ్చురేగె; దు
ష్కర్మలవిత్ర! చూడు మనఘా! రఘురామ! దయాబ్ధి చంద్రమా!

ప్రకృతికి సత్ప్రతీకలయి వర్ధిలు మాతృ జగత్స్వరూపులౌ
సుకృత మనోజ్ఞ ప్రేమ గుణ శోభల శోభిలు స్త్రీజనమ్ములన్
అకృతపు కృత్యులై ఖలులు నారడి వెట్టుచు రచ్చకీడ్చి బల్
వికృత మొనర్చి రయ్యా! కనవే! రఘురామ! దయాబ్ధిచంద్రమా!

---

1. శాఠ్యచిత్తముల్.

అసురభావముల్ హృదయ మందసియాడగ నాతతాయులై
మోసము నంగనాచితనముల్ గల మానవ దైత్యులెల్ల భ
స్మాసురులై యమాయకపు సాధు జనంబుల నూడ్చు చుండి రో
శ్రీసదనా! కనుంగొనవె! శ్రీరఘురామ! దయాబ్ధి చంద్రమా! ౪

దుష్టులు; మేక వన్నె పులి త్రోవలఁ ద్రొక్కిన ధూర్తలోక రా
జ్యేష్టులు; నాయకాఽధములు, హీనవిచారులు, శాఠ్య కర్మ సం
స్రష్టలు, పెచ్చు రేగుచు బజారుల కీడ్చిరి ధర్మదేవతన్
ఇష్టము తీరు ద్రొక్కిరి హరీ! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౫

తెలి విసుమంత లేని చెడు తెన్నుల సాగెడి దొంగ తొత్తు కుం
కలు చెలరేగి హెచ్చుగ చికాకొనరించిరి తల్లిదేశమున్,
తెలిసిన పెద్దలైరి పలుతెక్కలికాండ్రగు పోతరాజులే
తెలిసితివయ్యవీరల విధిన్? రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౬

మూతికి మీసమూడ్చి పరిభూతుల బూతుల కూతలొ చల
ప్రేతలు నోర్ధరాజుల మతిం గల దుర్మద కాల దూతలే
నేతలు నేడు నీ పుడమినిండిరి భారత మాతృదేవి పల్
రీతులఁ గృంగెఁ గాంచితివ? శ్రీ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౭

తల్లియె దయ్యమైన బుడుతండిల దిక్కరినట్లు, చేత సం
ధిల్లిన కల్జి పామగుప తీవ్రవిలి కాటిడి నట్లు దుర్గుణో
ద్వేల్లితు లైన నాయకులు దేశ వినాశకులైరి స్వార్థతన్
ఉల్లము నొచ్చిపోద? గనవో రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౮

నేతలు గారు నేటి ప్రజ నేలెడి నేతలు కాలదూతలే
కూతలె కాని చేతలనఁ గొంచెము గానని కేటుగాండ్లె యీ
జాతికి నేతలైరి, కడు స్వార్థపిశాచపు వృత్తిగల్గి; భూ
మాత సహింపదయ్య! గనుమా రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౯

దండిత దుర్విదగ్ధ రిపు దానవ! ధార్మిక సద్విజాదు లు
ద్దండులు మాన్య మానవులు ధర్మ విరుద్ధపు జాతి వైరతన్
మెండుగ జీర్చివేయబడి మిత్తిని గాంచిరి; దుష్టులౌచు బల్
నిండగ మండలేశు లిలనే! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౦

దుండగు లైన దండి పెను దున్నలు కాలుని దున్నలౌచు బల్
తిండులపోతులౌచు బలు తెక్కలికాండ్లును కేటుగాండ్లు పా
ఖండులు దేశమంతట సఖండముగా పలు మండలేశులై
మెండుగ నిండినారు గనుమీ! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౧

వంటకు కూటికిన్ మొగమువాచిన బూకటి భూమి భిక్షకుల్
తంటలు బొచ్చెముల్ గనని ధార్మిక కార్మిక కర్షకాదులన్
కుంటొనరింప నాకొనిన క్రూరపు నాగుల తీరు మండలం
బంటిన నేతలైరి గనవా? రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౨

దయ గని రాగదయ్య! భరతావని నీ పునరావతారమున్
నయ మని కోరుచుండె, కరుణామయ! నీ కమనీయ మాధురీ
ప్రియ మకరంద తుందిలిత బిందు లస త్స్మిత దృక్పరంపరన్
రయమున జిల్కి యేల గనదా! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౩

రాగదవయ్య! రాజ ఋషి రాజ్ఞత పాద సరోజ! సత్కృపా
శ్రీగరిమంబు మాపయినఁ జిల్కఁగ రాగదవయ్య! భారతీ
శ్రీగణనీయ సంస్కృతులఁ జెల్వగు న్యాయపు ధర్మ మూర్తియే
తా గతి దప్పె గాంచవలదా? రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౪

కన విన రాని స్వార్థ శిఖి కర్కశమౌ పెను మంటలందు నీ
యనఘ ధరిత్రి చిక్కుకొనె నార్తి సహింపక బొబ్బ వెట్టెరా!
అనిశము ద్రోహ తత్పరు లమానుష హింసల దోచి రీధరన్,
కనుగొనఁ జాలిరాద? యనఘా! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౫

తీరని స్వార్థ దాహమున దేశమునందలి శాంతి భద్రతల్,
మారణ కాండ యందు మటుమాయము లైనవి, సత్య ధర్మముల్,
దారి గనంగ లేక పెడదారుల ద్రగ్గెను, నైతికత్వముల్,
పేరడగారఁ గృంగె, గనవే! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౬

రాగదవోయి! దుర్విమత రాక్షస తీక్ష్ణ కుఠార! నీ కృపా
శ్రీ గణనీయ దృక్కులిడి చెల్వగు భారత దివ్య వర్షమున్
మూగిన స్వార్థ పీడనల పూడ్చి యనన్య విశిష్ట శాంతిచే
వేగమె బ్రోవఁ జూడగదవే! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౭

పీడని హింస లెల్ల కడు వేడ్కన బీదల జీవితాలనే
వాడగ జేసె, వంచనలు బల్విడి రేగి ప్రజాళి నూడ్చె, వెం
పూడెను శాంతి దాంతులకు ముష్కర రాక్షస చిత్త వృత్తులే
దాడుల సేసె నిమ్మహి సదా రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౮

యుద్ధపు చిచ్చు మంటలు భయోద్ధతి డోలల నూపె సత్ప్రజన్
అద్దమరేయి చీకటుల నారడి జీవన మాయె నేడిలన్
హద్దులు పద్దు లేని చెడు హంగులలో బడుచుండె లోకమే
ప్రొద్దునఁ గ్రుంగ నెంచునొ! ప్రభూ! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౯

అణు పరమాణు పూర్ణమగు నస్త్రములున్ క్షిపణుల్ శతఘ్నులున్
దణ దణ మంచు మృత్యు నినదంబయి మ్రోగెడి కాలమేచె నే
క్షణము ప్రమాదమో ధరణికాంతకు వంత లనంత మయ్యె ర
క్షణ నిగి భూమి నేలుము తగన్ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౦

రక్త పిశాచు లిమ్మహిని రక్తిన మానవ రక్తమాంసముల్
శక్తి కొలంద పీల్చి పెలుచన్ భరతావని నెల్ల గూల్చ నా
సక్తిని జూపు చున్నవి; విషాదపు ఛాయలు మూగె నిద్ధరన్
యుక్తినఁ గావఁ జూడవె ప్రభూ! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౧

మానవతల్ నశించినవి; మాన్యత లంతకు రూపుమాసె; ప్రే
మానుగుణైక జీవనము మచ్చుకు గానగరాదు కామ తృ
ష్ణానుమతైక మోహముల సందడి హెచ్చె; త్వదీయ చింతనల్
మానె జనాళి మౌఢ్య మలమన్; రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౨

మంచితనమ్ము నూడ్చు చలమౌ తెలివిన్ దెగ బెంచి ధూర్తులై
లంచము నూని మంచమిడు లంజియల ట్లధికారదుర్మతుల్,
కుంచిత బుద్ధులై ప్రజలఁ గూల్చిరి లంచము నూని దుర్విధిన్,
లంచ మదేమి చేయదె యిలన్? రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౩

మాన్యత మానవత్వముల మాన్పని మంత్రము లున్న మంత్రులే
శూన్యము లైరి, నేఁడవని శుంఠలు ధూర్తులు మానహీనరా
జన్యపు మంత్రమున్న పెనుశాత్యులె మంత్రులు నేఁడు యీ ధరన్;
ధన్యతఁ బాసె నిమ్మహి సదా! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౪

రాసభ రాజ్యమా యిదియ? రావణ రాజ్యము మించినట్టి భ
స్మాసుర రాజ్య పాలనము సాగిన దిమ్మహి కేటుగాండ్ల పే
రాసలు హెచ్చి రాచి పెనుఱంపనఁ బెట్టెను సత్ప్రజావళిన్,
వాసవ తుల్య శౌర్య! గనవా? రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౫

విజ్ఞత లంతరించె, నడివీధిన హత్యలు పెచ్చురేగె, దో
షజ్ఞులు మానవత్వముల సాంతము నూడ్చి చరించుటాయె స
ర్వజ్ఞులు శాంతి కాము లిల భగ్న మనోరథులైరి యెయ్యెడన్
ప్రాజ్ఞ నుత స్వరూప! గనవా? రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౬

ప్రకృతికి మేల్ప్రతీకలయి రక్తి జెలంగెడు మాతృమూర్తులౌ
సుకృతులు పూజనీయులు ప్రసూన శరోర్జిత సాయకాంగనల్
వికృత జనాళిచే మిగుల వేదన లంద, దరిత్రి యేడ్చెరా
ప్రకృతపు దుర్దశన్ గనెదవా? రఘురామ! దయాబ్ధి చంద్రమా. ౨౭

## నేటి స్త్రీలు

మానవతీత్వ ధర్మములు మాయని పూజ్యులు మాననీయులౌ
చానలు సంస్కృతీ భరిత సభ్యతలన్ విడనాడి దుర్విధిన్
గానని దుష్ప్రవర్తనలు గల్గి ధరిత్రికి భారమైరి యో
మానధనాగ్రగణ్య గనుమా! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౮

## స్త్రీ గౌరవమే జాతి గౌరవము

చెట్టుకు మూల మెట్లో పరిశీలన జేసిన జాతిమూలమై
గట్టిగ నుండు స్త్రీ ప్రకృతి; కాంచగ నా ప్రకృతిన్ గలంచినన్
కట్టులుకన్ జగంబు పడికాలదె, స్త్రీత్వము పూజనీయ మే
పట్టున జాతికంత నిలపై రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౯

ఆడది యేడ్చు కుందిలు గృహంబది యెయ్యెడ పల్లకాడె యౌ(రా)
ఆడది నవ్వులన్ వెలుఁగు నా గృహ మెప్పుడు స్వర్గసీమరా!
ఆడది యాడ యీడనక నంతట గౌరవ మొందునాడు నా
జాడలె పూలమేడలె యసల్, రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౩౦

స్త్రీ లెట గౌరవంబులను జెందుదురో యట సర్వసంపదల్
ప్రాలును; సర్వ మంగళ కరామరు లెల్లరు నిల్తు రర్మిలిన్
స్త్రీ లెట గౌరవంబులను జెందరొ యష్ట దరిద్ర దేవతల్
హేలన జేయుచుం డట మహిన్ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౩౧

## స్త్రీధన జీవులు

మూతికి మీస మున్న మగపుంగవుడింతి ధనమ్ముతో చల
ప్రేతము తీరు జీవనపు తీరులు లేని పథాల సాగు; వి
ఖ్యాత కథా విహీనుడయి ఖండిత ఖండన ఖండ జీవియై
రోతయి పోవు నిక్క మిదిరో! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౩౨

### వరకట్న పిశాచులు

ఆడది యేడ్చి యిచ్చు ధనమౌ వరకట్న పిశాచ శుల్కమే
డేడు తరాల నైన విఘటించి దహించక మాన దింత కీ
పాడు ధనమ్ముతో వరుడు వ్యర్థుడునై శవ జీవితమ్మునే
కూడును, వాని కూర్మ లుడుగున్, రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౩౩

### చెడుపద్ధతులే స్త్రీల అగౌరవములకు మూలము

మానవతీ లలామలకు మాన్యత లూడ్చెడి దుర్విధానముల్
కానని తీరు తీరు వెటకారపు వేసము బాస లెల్ల యెం
తో నన రాని హీనతలు తోడయి నిల్వగ, స్త్రీత్వ గౌరవం
బే నశియించె చూడ పుడమిన్, రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౩౪

రాజులు బూజులైరి; చెడు రంజిలు బూజులె రాజులైరి, యీ
రోజున బత్తిమీజు లిల రూఢిగఁ దేజయి యాజు బాజులన్
మోజులు మీర నేక్షనులఁ బొందిక లూడగ దోచి రోమహో
రాజ! కలి ప్రభావ మిదెరా! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౩౫

రోషము హెచ్చ జాతిపయి రూఢిగ సత్కుల వర్ణ వర్గ స
ద్భాషల యందు; దేశమున, ప్రాంతమునన్, పలు పల్లెలందు వి
ద్వేష పిశాచి పూనెనుర! విజ్ఞత లూడ ననైక్యబుద్ధిచే
దూషితులైరి మానవహితుల్, రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౩౬

కన్నుల గప్పి స్వార్థపు వికారపు మత్తులు నిండిపోయి యెం
దున్నను తారతమ్యముల త్రోవల గానక తోచి నట్లుగాఁ
పిన్నల పెద్దలన్ గనక వింతగ దోతురు శాస్త్ర లెల్ల రా
పన్న శరణ్య! చూడ వెరపౌ, రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౩౭

కుక్కలు విస్తరిన్ జినుగఁ జేసిన తీరున దేశమాతనే
ముక్కలు ముక్కలై చెదరి పోవగఁ జేయుచు నుండిరయ్య! యీ
రక్కసులైన స్వార్థులగు రాతిమనస్కులు, దిక్కు నీవె యీ
చిక్కుల దేశమాత కిట శ్రీరఘురామ! దయాబ్ధి చంద్రమా! ౩౮

ఎంగిలి పీసు విద్దియల యెంగిలిలో బడి భారతీయ స
త్సంగతి; యింగితంబులును; సంస్కృతి, సభ్యత, సద్విచార పా
రంగత వైదికత్వములు, రంజిలు హైందవ ధర్మదీప్తి రా
జ్యాంగము లెల్ల రూపరెనయా! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౩౯

చదువుల రాసులౌ పెరియసాముల కన్నను నెంతనైన నా
చదువని చాకలయ్యోలె పసందగువారలు వారె గొప్ప; ఈ
చదివిన వారు స్వార్థపర సంకుచితాత్ములు నౌచు బీదలన్
చెదరగఁ జేసి దోతు రిల, శ్రీరఘురామ! దయాబ్ధి చంద్రమా! ౪౦

వీడని స్వార్థ చింత, నడివీధిన హత్యలు, మానభంగముల్,
మోడులు వడ్డ జీవనము, మూర్ఖుల పెత్తనముల్, కుతంత్రముల్,
తోడుగ నున్న వంచనలు, ధూర్తుల యేల్బడి, గల్గెరా! వగల్
చూడఁగ చుక్కలెల్ల మొలుచున్ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౪౧

అణు పరమాణు పూర్ణ మగు నస్త్రము లెల్ల ధరా తలంబునే
వణుకగ జేయ సత్ప్రజలు వంతలఁ జింతలఁ జిక్కియుండిరే
క్షణమున శాంతి భద్రతలు కాద్వడనున్నవి, ధైర్యమూడె, ర
క్షణ నిడి యేలుకోవె! యనఘా! రమారామ! దయాబ్ధి చంద్రమా! ౪౨

యుద్ధపు కాలమేఘము మహోద్ధతి గర్జన జేయుచుండె సం
కృద్ధపు స్వార్థమౌ పులులు కృంగక గాండ్రిలె, దుర్నయాఽహి స
న్నద్ధమునయ్యె సజ్జగతి నంతట కాటిడ, రక్ష నీవె లో
కోద్ధరణా! కృపన్ గన దగున్; రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౪౩

పాపము పెచ్చు రేగినది, ప్రాజ్ఞులు దుఃఖితు లైరి, సత్యమా
రూపరుచుండె, ధర్మములు రోగము లందెను, శాంతి దాంతి, దు
స్తాపము లందుఁ జిక్కె, కడు దార్ఢ్యత లందెను, స్వార్థ దుర్విధుల్,
శ్రీపతి! బ్రోవు మిమ్మహిని శ్రీరఘురామ! దయాబ్ధి చంద్రమా! ౪౪

మతముల గ్రుద్దులాటలు సమస్త మహీవలయమ్ముఁ జీల్చె నం
చతి గతి లేని వారు ధరఁ జాటిరి, వారలె పార్టిపేరునన్,
స్థితి మతి లేని దుర్మత విధిన్ దేగఁ జీల్చుచు మానవత్వమున్
చితుకగ జేసినారు గద! శ్రీరఘురామ! దయాబ్ధి చంద్రమా! ౪౫

ద్వేషము, లీర్ష్య, దుష్కపట తీవ్ర శఠత్వము, జాతి వైరమున్,
రోష కషాయితోద్ధృత దురూహలు, బ్రాహ్మణ దుర్విరోధముల్
దోష విచార మానసులు దుర్మద రాక్షస తత్వపారగుల్,
మోషిల జేసి రిమ్మహి, రఘూ! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౪౬

## ద్వేషులు

అన్నము నందు ద్వేషములు, నచ్యుతుడౌ హరి యందు ద్వేషముల్,
మన్నన గన్న బ్రాహ్మణ సమాజమునం దనరాని ద్వేషముల్,
మిన్నగ రెచ్చెనయ్య! మితి మీరిన స్వార్థము గల్గువారిలో,
సన్నిహితంబె మృత్యువు వెసన్ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౪౭

## నాస్తికులు

ని న్నెద నెన్ని నమ్మకొని నిల్చిన నిర్విషయైక చిత్తులన్
పన్నగ ధర్మ తత్పరులఁ బాపపు బుద్ధిన నాస్తికాధముల్,
కన్నును మిన్ను గానక వికారపు దూషణ జేయుచుంద్రు, మృ
త్యోన్నతిఁ బొంద గోరి కుమతుల్, రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౪౮

**నేటి యొజ్జలు - బాలురు**

ఓరిమి, త్యాగ శీలత, గుణోన్నతి, సూనృతవా క్సుధల్; సదా
చారము, సాధు సంస్కృతిక్రియలు; సభ్యత, సఖ్యత, ప్రేమ విజ్ఞతో
దారులునైననొజ్జ లిల దక్కరు, ముష్కర చిత్తు లొజ్జలే
చేరిరి, విద్య సన్నగిలె, శ్రీ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౪౯

చారు తరైక శీలతల సాగగఁ జేసెడి విద్యనెల్ల వ్యా
పారము లందు లంచముల పాపపు దారుల నమ్మచుంద్రు, దు
శ్చారులు షడ్రిపూద్ధతిన సాగుచు; నీ జయ భావి భారతో
త్పారులు భగ్నులైరి యిలపై, రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౫౦

భారత భావి పౌరులగు బాలురు ధూర్తుల పాఠశాలలం
దారని ద్వేష రోష దురితాశ్రయు లొజ్జలు చూపు దారులం
దారిరి జ్ఞాన శూన్యు లయి దారుణ దుర్విషయాగ్ర గాములై
మీరిరి భ్రష్టులైరి బలిమిన్, రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౫౧

తెక్కలి కాంద్రు స్వార్థపు మతిన్ బడులం దగ జేరి గద్దెలం
దెక్కి కుతంత్ర చిత్తులయి దీటుగ భారత భావి పౌరులన్,
రొక్కము లాగ కుక్క లయి రోతగ రేగుచు దోచుచుంద్రు దా
రెక్కడ గాన నివ్వ కిట, శ్రీరఘురామ! దయాబ్ధి చంద్రమా! ౫౨

వంచక బుద్ధితోఁ గలిమి పండుటకై వెను స్వార్థ చిత్తులై,
లంచము లందు కొంచు కుటిలంబుల బెంచుచు తేనె కత్తులై
మంచిని నెంచ కమ్మకొన మర్గిరి విద్యను, భావి పౌరులన్,
చించిరి కొంక కిమ్మహిని, శ్రీ రఘురామ! దయాబ్ధి చంద్రమా. ౫౩

**అంతా నీ నాటకము**

ఎంతగఁ జెప్పినన్ దరగ వింతగ నీ కలికాల దుర్విధుల్,
అంతయు నీ వెఱుంగుదువు, యజ్ఞత నార్తిన జెప్పి తింత న

ర్వాంతరవర్తి! కర్మ గతి వర్ధిలు బుద్ధి, త్వదీయ నాటక
మ్మంత త్వదిచ్ఛ తీరగు సుమా! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౮

ఏ విధి నెట్లు నే పగిది నెక్కడ నెప్పుడు నేమి సాగునో
ఆ విధి నట్లు నా పగిది నక్కడి నప్పు డదెల్ల సాగురా!
ఈ విధి నెల్ల నీదయిన యిచ్ఛన సాగును, ధాత్రి రక్షణల్
నీవె కదయ్య! సత్య సుగుణీ! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౨

శ్రీ పరవాసు దైవత విశేష నవాంశ శుభావతార! ధ
ర్మాఉపరమూర్తి! భాను కుల మండిత దివ్య మనోజ్ఞ రత్నమా!
ఆప దనన్య తాప హర! అంజలిఁ జేసితి ధాత్రిఁ గావరా!
శ్రీపతి! ఆలవాలపుర శ్రీ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౬

—: o :—

# సంస్తుతి రత్నము

## సప్తమ స్తబకము

శ్రీ రమణీయ సద్గుణ వి
శేష విరాజిత జానకీ సతీ
చారు హృదబ్జ రాగ రస
సన్నుత సేవిత పాద పద్మ! రా
మా! రవి వంశ సోమ! కనుమా!
నను నిన్ శరణన్న వాఁడరా!
శ్రీరుచిరాఽలవాలపుర శ్రీ
రఘురామ! దయాబ్ధి చంద్రమా!

శ్రీశుని సత్కృపన్ శ్రమలు చెందక గల్గిన వై యనన్యమౌ
ధీ శమదాది విజ్ఞతలు దీపిలు చున్న మనోజ్ఞ భక్తి వా
రాశుల, రంగనాథ పద రాజ విరాజిత నాథ మౌనులన్,
నే శరణంచు వేడెదను నిన్ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧

ఇహ పర లోకమం దెవరి యింపగు పాదము లాత్మ కెయ్యెదన్
బహు విధ రక్షకంబులు నుపాయము ప్రాప్యములై చెలంగు, నా
విహితుని శ్రీశు పాదముల విజ్ఞతఁ గల్గిన నాథ మౌనులన్,
అహ రహ మెంచి నిన్; దలచెదన్, రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨

శ్రీహరి భక్తి తత్వము లెఱింగిన పెద్దలలోన పెద్దలై
దేహము సర్వమున్ మరచి దీపిలు భక్తి సుధాఽబ్ధిఁ దేలి, యే
యూహకు నందలేని లలితోక్తుల లోకము నేలు మౌనినిన్,
స్నేహముఁ గోరి నిన్ దలఁతు శ్రీ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౩

మూడయినట్టి తత్వములఁ బూత మనోజ్ఞ గతి త్రయంబులన్,
పీడక నన్నిటిన్ మిగుల విజ్ఞత [1]తొప్ప పురాణ రత్న మం
దీడిత మొప్ప జాటిన సుధీమణి మౌని పరాశరున్ మదిన్,
వేడి నుతింతు నిన్ను, గనవే! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౪

మాకును, మాకు పూర్వులగు మామక వంశజ కోటి కెల్ల నే
శ్రీకమనీయ పాద జలజేందిర, తల్లియు, దండ్రి దార ప్రే
మాకర సంతతుల్, హిత సమస్తము నౌప్పునౌ యా శఠారివౌ
శ్రీకమలాంఘ్రిలన్ దలతు, శ్రీ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౫

నిగమములందు మద్హృదిని నిండి వెలింగి మ దీప్సితాళికే
సుగమములై మదీయులకు, సూరి జనాళికి, నింటి వేల్పులై,
తగు సిరు లిచ్చి వెల్గు భవ దంఘ్రిలఁ గొల్చెద, మీకు నేను కా
నగఁ దగనా? సితాబ్జ నయనా! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౬

భువన విభుండ వైన నిను, మున్గుచు భక్తిన, బ్రహ్మ శర్వ వా
నవ సురులాదు లింత నిను జాటగ జాలరటయ్య! అజ్ఞుడన్,
కవి నని సిగ్గు లేక నిను గానక పల్కెద నెట్లు? నాకు నే
నవమతినైతి, కావు కరుణన్, రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౭

అల నిగమావళి, బ్రహ్మ సులభంబుగ నిన్ వివరింప పూర్తిగా
తెలియరటయ్య! నే నెవడ తెల్యుట [2]కైనను శక్తి కొద్ది నిన్
బలికెద, లేదు భేద మణు పర్వతముల్ జలధిన్ మునింగినన్,
కలియునె నొక్కటై తలచగన్, రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౮

---

1. విష్ణుపురాణము.
2. దెలియ వచింతు భేదమన దీరదు నబ్ధిన పర్వతాణువుల్
కలిసి మునుంగ నొక్కటగునా, రఘు........

ఓ కరుణాయతాఒక్ష! భవ దున్నత సత్కృప గల్గ సంస్తుతిన్
గైకొను శక్తి కారణము గాదు, తదీయ శ్రమంబె హేతువౌ,
ఈ కడు మంద బుద్ధి కిటు లీశ్రమలే యుచితైక మార్గమౌ,
చేకొను డీశ్రమాశ్రయుని, శ్రీరఘురామ! దయాబ్ధి చంద్రమా! ౯

లీలగ నీ కృపేక్షణము లేక జనింపదు లోకమెల్ల యిం
కేల స్థితి ప్రవృత్తిఁ గను? కేశవ! నీవె సమస్త ప్రాణి లో
కాలకు స్వామి వార్తహిత కారివి, నీ శ్రిత వత్సలత్వముల్,
చాల వి చిత్రమౌర తలచన్, రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౦

నారన! సాజమై యవధి నందని యీశ పరేశ్వరత్వ మీ
పై రహి వెల్గుచుందు వని వైదికు లెవ్వరు నొప్పకుంద్రు? త్వ
ద్ధీర మహాత్మ్య వార్నిధిన దేలెడి తుంపురులే య జేంద్ర శ
ర్వేర దిగీశదివ్యగణముల్ రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౧

ఎవ్వడు శ్రీకి శ్రీమతుడౌ! ఎవ్వడు నుత్తమ సత్వ ధాముడో!
ఎవ్వడు పుండరీక లలితేక్షణు డెవ్వడు పూరుషోత్తముం
డెవ్వని యంశ కోటిన నటించు శతాంశము యీప్రపంచమై
అవ్విభు వైన నిన్ గొలుతురా౹ రఘురామ! దయాబ్ధి చంద్రమా. ౧౨

[1]ఆగమ చోరు నూడ్చి,[2] దనుజాదుల నొంచి, [3]గురూగ్ర పాపమున్,
పోగ నడంచి; ఉన్నతపు పుణ్య పదంబిడి ధాత నాహరున్;
బాగుగ నేలి తీవె; తవ పాద సుభోద్భవ నూని యీశు డీ
డై గరిమంబు గాంచె శివుడై; రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౩

---

1 వేదచోరులైన మధుకైటభులను రక్కసులను విష్ణువు హయగ్రీవావతార మెత్తి చంపెను.

2. అంధకాసురులను చంపి వారి నుండి శివునిని విష్ణువు కాపాడెను.

3. రుద్రుడు కోపముతో గురువైన బ్రహ్మ శిరస్సును కొట్టగా శిరము శివుని చేతికి అంటుకొన పాపుడయ్యెను శివుడు, విష్ణువు తన రక్తము చేతిచేత తలను తుడిచి శివుని పాపమును పోగొట్టెను.

ఎవ్వని లోన నుండును వి ధీశ సురేశ సురాది లోకముల్;
ఎవ్వడు సృష్టి సంస్థితి లయేశుడు నెవ్వడు గొల్చె విశ్వమున్;
ఎవ్వని వల్ల నీజగము లేర్పడి వానిన లీన మొందు, వా
డెవ్వడొ కాదు నీవెర! ఘటీ! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౪

త్యాగ సుశీల రూప చరితంబులఁ జక్కని సత్వ సంస్థితిన్;
ఆగమ సాత్వి కాఢ్య విధి నవ్యయ ధార్మిక సమ్మతంబునన్;
బాగుగ నిన్నెఱుంగ నగు; భగ్న కరాఽసుర బుద్ధి గల్గు దు
ర్భోగులు నిన్నెఱుంగరు ప్రభూ! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౫

[1]త్రివిధపు సీమ దాటి; పలుతీ రులునెక్కువ తక్కువన్న స
ద్వివరణ మాని యున్న భవ దీయ పరత్వ ప్రభుత్వ ధర్మమున్;
భవ దనవద్య [2]మాయ లిట పర్విన; ఁగొందఱు సన్మహాత్ములే
స్తవముల గాంత్రు నిన్ను వరదా! రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౬

అల పదునాల్గులోకము లజాండపు జీవులు; పంచ భూతముల్;
అలఘు[3] దశోత్తరావరణ మైన మహత్తులు; క్షేత్రవేదులున్;
పలు గుణరాశి; బ్రహ్మమును; భవ్యపదంబును నీ విభూతులే
అలరును శేషభూతములునై రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౭

స్థిర సమ సద్గుణంబులు; శుచిత్వ వదాన్య మృదుత్వ మాధురీ
వర ఋజు వర్తనాలు; వశవర్తి కృతిత్వ కృతజ్ఞతా కృపా
పరతలు; సర్వమున్ తమరి వైన స్వభావములే గదా! శుభం
కర గుణవార్ధి వీవె; కనగా రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౮

---

1. దేశము - కాలము - విషయము.
2. సత్వరజస్తమోమయమైనది మాయాప్రకృతి.
3. పంచభూతములు ఒకదానికంటె ఒకటి మహత్తులై దశోత్తరావరణములై యుండును. వీనినే సప్తావరణములందురని విష్ణుపురాణము చెప్పుచున్నది.

అందముగా నొకొక్కఁ టగు నందము కంటెను బ్రహ్మమైన యా
నందము మిన్న యౌ నని యనన్య విధిన్ వచియించు నాశ్రుతుల్;
అందము లున్న తావక గుణంబొక టైనను పొంద లేక నం
దందె ప్రయత్నతన్ గొలుచెదన్; రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౧౯

ఆరయ సృష్టి సంస్థితి లయాదులు; మోక్ష విధాయ కాదులౌ
నీ రమణీయ కార్యములు; నీ శ్రితులౌ దివిజాది కోట్ల కిం
పారెడు లీలలౌ; నిగమ వైభవ సద్విధు లెల్ల వారి హృ
న్నీరధి నంటి యుండు సుగుణీ! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౦

త్రికరణ కర్మ కాండల కతీతుడ వైనను; వాఙ్మనోఽనుకూ
లక విషయుండవై; యతి విలక్షణ సంప దనంత వర్తివై;
ప్రకటిత దాస వత్సలత రంజిలు సద్గుణి వైన నీకు హా
ర్దిక బహుళాంజలుల్; గొనవె! శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౧

ఎఱుగను ధర్మచింతనల నింతగ నాత్మ నెఱుంగ లేను; నీ
సరసిజ పాద భక్తి గన జాలను; రిక్తుఁడ; దిక్కుఁ మాలి నీ
చరణములే శరణ్య మని సాగిలి చేరితి నోశరణ్య! నన్
కరుణ నొసంగి బ్రోవు మనఘా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౨

వేదము; లైన శాస్త్రములు; విజ్ఞులు; బల్ నిరసించి నట్టి పా
పాది దురంత కర్మల నపారము చేసితి; తత్ఫలంబులే
వేదన గూర్చ మీ యెదుట బిడ్డగ రోదిలు చుంటి నోముకుం
దా! దయఁ జూడు తండ్రి! వరదా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౩

అంతము లేని యీ భవ మహార్ణవ మధ్యన మున్గు చున్న నా
కింత కనంత! నేటికి సుకృ త్తతి పండగ తీర మట్లు నీ
వింతగఁ జిక్కనావు; కడు వేడ్కఁగ నీ దయ కేను జిక్కితిం
తింత దయైక పాత్రమయితిన్; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౪

భూత భవిష్య దాపదలఁ బొందెడి దుఃఖ మసహ్య మైన నే
నై తగ నోర్చియుందు; కరుణామయ! నీశరణాఽగతాశ్రితో
ద్వ్రాతము నేల కున్నను పరాభవ మేర్పడు; నీస్థితింత నీ
కై తగ దయ్య! కావు మనఘా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౫

హేలన తోడ నే నిట బహిష్కృతు నైనను నీ పదద్వయా
బ్జాలఁ దొలంగు నిచ్చ గన జాలను; నింత స్తనంధయుండు రో
షాలస యౌచు తల్లి విడజాలిన తచ్చరణాల పీడ ద
బ్బాలునిఁ దల్లి బ్రోవదె? కృపన్; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౬

సుధలు స్రవించు మీ చరణ సుందర పద్మము లందు లీనమై
కదలక నున్న నా యెదదఁ గాంచ దసారపు వేరు వస్తువున్;
మధువొలికించు పద్మముల మాని మిళిందము గొబ్బి పూలఁజే
రదుగద! సార హీన మనురా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౭

త్రిభువన నాథులౌ తమరి దివ్య పదంబుల నెవ్వ రేవిధిన్;
శుభ మని యొక్క సారి మతిఁ జూపి నతాంజలిఁ జేయ వారికా
విభవము గల్గు; దోషములు వీడును; నెల్లపు డెట్టి వేళ లం
దభయము లొప్పి యుండు; వరదా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౮

నీ చరణాఽరుణాబ్జముల నిల్చిన భక్తి సుధాఽబ్ధి బిందువుల్
వీచెడి భోగ మారుతపు వీధుల మందు దవాగ్ని రూపమై
కాచెడి యీ భవాగ్ని నడ గార్చును తక్షణ మందె; నిర్వృతిన్
తూచ కొసంగు నంచుఁ గొలుతున్ రఘురామ! భవాబ్ధిచంద్రమా! ౨౯

అనుపమ మౌనజాండముల హాయిగ గొల్చిన వైన; నన్యమౌ
పనులను మాని భక్త జన బాధలు మాన్పగ సిద్ధమైన; మ
ద్దన నిధు లైన; తావక పదాబ్జములన్ సతతమ్ము తృప్తిగాఁ
గనుగొనఁ జేయుమయ్య! అనఘా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౦

స్వామి! త్రి విక్రమా! మహిత శంఖము చక్రము కల్పకంబు వ
జ్రామల నీరజ ధ్వజ విరాజిత సచ్ఛ్రుణు లైన చిన్నె లిం
పై మసలాడు మీ చరణ పద్మము లెప్పుడు నా శిరస్సునన్
క్షేమము గాగ భూషిలునొ? శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౧

బాల సువర్ణ వర్ణ విభవాఽలయ చేల! స్మితాఽతసీ సుమ
శ్రీలలితాఽభ నీరద విశేష తనూజ్జ్వల! పద్మనాభ! శ్రీ
లోల దురస్థలోన్నత విలోభిత లాంఛన! నిన్ను గొల్చి యె
వ్వేళలఁ దుష్టిఁ గాంతు? గనవే రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౨

భూషిత సచ్ఛరాసనపు పూర్ణ కిణాంకము లొప్పి యున్న వై;
దూషిత దైత్యకోట్ల కిల దుస్సహమై నిడుపై రమైక సం
శ్లేషము దెల్పు సౌరభము చేరినవై యలరారు బాహువుల్
భూషిలు నిన్ను గాంతుర! ప్రభూ! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౩

పీన సమోన్న తాంస పరివేల్లిత కర్ణ విభూషణాలతో;
శ్రీనుతమైన ముంగురుల చెల్వముతో; వర కంబు కంఠ ది
వ్యాఽనఘ శోభతో విదు నవాబ్జ ముఖాంశువుతో వెలుంగు నిన్
శ్రీనిధి! కాంతు నే నెపుడొ? శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౪

అలఘు నవాబ్జ రమ్య నయనాఽయత శోభలు; గండ పాండువుల్;
లలిత నతాఽయత భ్రువుల లాస్యము; మంజుల సుస్మితాధరం
బుల రుచిరంబు; మొగ్గ వలె ముద్దగు నాసము; గుబ్బు ముంగురుల్
చెలగెడు నిన్ను గాంతెపుడొ? శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౫

మణి మయ మౌళి; యంగదము; మంజుల హారము; కౌస్తుభాంకముల్;
క్వణన మనోజ్ఞ మైన మొల గజ్జెలు; నూపుర రత్న రమ్య కం
కణములు; శంఖ చక్ర వర ఖడ్గ గదా ధను వైజయన్తికో
ద్గణములు వెల్గు నిన్ను గనెదన్; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౬

ఏ సిరి కిల్లుగాఁ దమరి యింపగు వక్షముఁ జేసినాడవో!
ఏ సిరి పుట్టినిల్లు కడలే తమకిష్టమొ; యే మహోదధిన్;
ఏ సిరికై మధించి యుబిగించితి వా సిరిఁ గూడి శేషపై
భాసిలు స్వామి! నన్ను గనవా? రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౭

తావక విశ్వరూప పరిదర్శన మందు సదా తదీయ శో
భా విభవంబుఁ గాంచినను పల్మరు నూత్నతఁ గూర్చి యొప్పి మీ
భావ గుణ స్వరూప విధి బాయని యా రమఁ గూడి శేషపై
సేవ నొనంగు నిన్గనెద! శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౮

జ్ఞాన బలైక ధాముడయి; చారు ఫణాంచిత రత్నమండలా౽
ధీన నుతోదరుండగుచు; దీపిలి దివ్య నివాసి యౌ ననం
తా౽నఘ సంజ్ఞుడైన ఫణినాథునిపై రమతో వెలుంగు నిన్
నేనయి కాంతు నెప్పుడొ? గుణీ! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౯

నిలుచుట కైన యిల్లు; శయనించుట కింపగు శయ్య దిండ్లు; వ
ల్వలు; వెలి గొడ్గు లాసనము; పాదుక లాదిగ మారి తాను సే
వల నొనరించి శేష దన బర్విన నా ఫణిరాజుపై సిరిం
జెలగి వెలుంగు నిన్గొలుతు శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౪౦

దాస; సఖత్వ; వాహన; వితాన; సుకేతన; తాళవృంత; ది
వ్యాసన మాది యౌ విధులఁ బర్వి త్వదంఘ్రుల మర్దనంబుచే
భాసిలు సత్కిణాంక కర పద్ముడు తార్క్ష్యుడు మిమ్ము గొల్వగా
శ్రీసఖ! కాంతు నేనెపుడొ? శ్రీరఘురామ! దయాబ్ధి చంద్రమా? ౪౧

స్వామి! భవన్నివేదన ప్రసాదము సాపడు విష్వసేనుడౌ
మీ మహనీయ సైన్య పతి మీకెఱిగించు ప్రయోజనమ్ములన్;
ప్రేమ నుదార చూపుల వరించి గ్రహించి యనుగ్రహించుమి
మ్మేమర కేను గాంతునొ? తమిన్ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౪౨

పలురక మైన క్లేశముల; బాపములన్ బడ గూల్చి సాజమౌ
పలు విధులంది మీకిట సపర్యలు చేసెడి నిత్యసూరులన్
గొలిచెడు ముక్తులం గలిసి కూర్మి నొసంగు మనోజ్ఞ మూర్తివై
చెలఁగెడు నిన్నుఁ జూతెపుడొ! శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౪౩

నిరుపమ నిత్య నూత్న రస నిర్భర భావ భరమ్ములై క్షణం
బరగకముందె కాల గతిఁ బాపెడి వైన విదగ్ధ ముగ్ధ భా
సుర మగు లీలలన్ సిరిని జొక్కఁగఁ జేసెడి దీర్ఘ బాహు సుం
దరముల వెల్గు నిన్నుగనెదన్ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౪౪

తెలియగ రాని వింత యగు దివ్య మహాద్భుత నిత్య యౌవనో
ల్లలిత సుధా మహాబ్ధివయి; లక్ష్మికి లక్ష్మిగనై సమర్థువై
విలసిత భక్త జీవివయి; భీతకు త్రాతగ, నర్థి కీవిగా
చెలఁగి వెలుంగు నిన్గనెద! శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౪౫

నే ననిశంబు మిమ్ములనె నెమ్మది బేర్మి ననన్యకామినై;
మానక నిత్య సత్య నియమంబుల సేవ లొనర్చువాఁడ నై;
నా నిజ నాథు వీవ యని నమ్ముచు శ్రీరమతో వెలుంగు మి
మ్మే నెపు డెట్లు గాంతునొ? తమిన్; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౪౬

సురముని యోగి వర్యులకు సూరి వరాజ శివామరాళికే
యెఱుగగ రాని నిన్ను; శుచిలేమి; యసూయత; నిర్దయాదులం
బరగి వినీతునై తమరివౌ పరిచర్యలఁ గోరుచున్న నా
కరయగ నిందలౌత! అనఘా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౪౭

వేల మహాపరాధముల వేదన లొందకఁ జేసి దుర్భరా
భీల మహోదధిం బడి తపించితి నే గతిలేక; పాప పు
ణ్యాల నెఱుంగ కుంటి శరణంటిని మీ చరణంబులన్ కృపా
శ్రీలిడి దాసు నేల గదె! శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౪౮

విను మిది కల్ల గాదు నిజ విన్నపముల్ తమ ముందె యుంచుచుం
టిని యిపు డీవు నన్ కృప ఘటిల్లగఁ జూడక యున్న మీకు నెం
దున దయఁ జూడ దగ్గ సుమతుం డొక డైనను చిక్కఁడయ్య! కా
వున కరుణించి బ్రోవుము విభూ! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౯౯

అమిత వివేక హీన జలదాఽవృత దిఙ్ముఖమై; బహు ప్రకా
రముల సతమ్ము దుఃఖపు పరంపర వర్షము సాగు చున్న సం
తమస భవైక దుర్దిన పథంబులఁ ద్రొటిలు చున్న నన్నుఁ గాం
చుము కరుణైక దృష్టి నిడుచున్; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౦

కోరి త్వ దంఘ్రి యుగ్మములఁ గొల్చుట కేను దపింతు నేవిధిన్
మీరు కృపన్ ననుం గన దమిం గలిగుందురు; వత్సలాత్ములై
మారని రక్ష్య రక్షకపు మంజుల బంధము వీడ కుండ; నిం
జేరిన నన్నుఁ గావగదె! శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౧

తను సుగుణేంద్రియాళిన యథా తథ మైన విధంబునుండినన్
తనకని యేదొ యొక్కటి యుదారగుణంబున నుండి తీరు; కా
వున నిట నీ యహంబను తమోగ్ర పదార్థము నుంచితిన్ భ
ద్ధన పద యుగ్మ పీఠిన సదా, రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౨

స్వామి! మదీయ మైన ప్రతి వస్తువు లాత్మ పదార్థ మెల్ల సం
క్షేమపు సర్వ సంపదలు; చేరెను మిమ్ముల శేష భూతమై;
ఈ మహితత్వమే నెఱుగ నెంచిన నా యెడ నివ్వదగ్గ వే
రేమియు లేదు; దాసుడను; శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౩

నాయెడ గల్గు శేషతల నారయ జేసితి రెట్లొ మీరు న
ట్లే యనవద్య తావక జలేజ పదంబులఁ జేర గల్గు స
ద్ధ్యేయ మనన్య మైన వినుతించెడి భక్తిని దెల్పి సత్కృపన్
బాయక బ్రోవరార! ప్రభువై; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౪

మీ పద పద్మ దాస్య సుఖ మేలెడి భక్తుల మేల్గృహాన మో
జై పడి యున్న కీటకపు జన్మము నెత్తి తదీయ సేవలన్
ప్రాపని చేతుఁ గాని పెర వారి గృహంబున బ్రహ్మ గాను నే
నేపగిదిన్ జనింపను; గుణీ; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౫౫

నీ దగు దర్శనంబు లోక నిమ్నము నైనను చాల టంచు; స్వ
ర్గాదుల; పౌరుషార్థపు సుఖంబుల రోసి త్వదర్థమై ప్రతీ
క్షాఽదరులౌ మహాత్ములు తగన్ ననుఁ గాంచ నొనర్పు; తద్వియో
గాదుల నోర్వ నెందు ననఘా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౫౬

మీ పరిచర్య భాగ్యముఁ దమిం గన జాలని యీ సుఖాదులున్;
ఈ పటు దేహ మాత్మయును నీ యసువుల్ తలఁపుల్ త్వదన్యమై
ఏ పెర మార్గ మూనిన సహింప; నవెల్ల నశించుతన్! ప్రభూ!
నా పథమే యిదౌను విననౌ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౫౭

ఆపగ రాని వంతములు నందని దారుణ మైన పాప దు
ష్కాపము లందుఁ గూలిన పశుత్వము గల్గిన దుష్ప ఘుండనై
మీ పద చింతనన్ గలిగి మిక్కిలి భీతిఁ దొలంగి మీ సప
ర్యా పరతంత్రు నైతిని; దయాంబుధి! వత్సలతా సుధోదధీ!
ఆపదనన్యబాంధవ! సఖా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౫౮

కపటపు భక్తి భావములు గల్గి నటించి రజ స్తమో గుణం
బెపుడును బెంచి; దుష్కపట విజ్ఞతతో నిను గొల్చి నంతనే
కపటము నుండి బాపి ననుఁ గాచుచు నా కపటైక చిత్తమున్
మీ పయి నిల్ప శిక్ష నిడుమీ! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౫౯

తల్లివి తండ్రి వీవె; దయితాఽప్త సుతాళులు తోడబుట్టు వా
రెల్లను నీవె; మద్గురు వరేణ్యులు మిత్రులు మీరె నాకు; నే
నెల్లపుడున్ త్వదీయుడను నీ హిత భృత్యుల భృత్యుడన్ ప్రభూ!
ఎల్లెడ నీకె బారకుడనే! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౬౦

స్థిర యశముల్; శుచిత్వము; త్వదీయ గుణజ్ఞత; మీ సయోగముల్;
వర గుణ పౌరుషత్వ విభవంబులు గల్గి త్వదంఘ్రి సక్తులౌ
సరసుల వంశమందు దగు జన్మము గల్గిన నే నమాధ్యనై
ఎఱుగని చీకటిన్ మునిగితిన్; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౬౧

గౌరవ హీనుడన్; శఠుడ; కల్మష చిత్తుడ; పాప సక్తుడన్;
మారవశుండ; వంచకుడ; మాయిని; ద్వేషి; నహంకృ తాత్ముడన్;
పారము లేని దుఃఖ భవ వార్నిధి దాటి త్వదంఘ్రి సేవకై
చేరుదు నేను నిన్నెటుల? శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౬౨

దురితుడు కాక దైత్యుడురు దుఃఖితుడై శరణన్న నాతనిన్
కరుణన నేలినా వరయగా; రఘునాథ! తృతీయ జన్మలో
పర మపదాద్దుడైన శిశుపాలుని నేలితి వేది నీ క్షమాఽ
దరణకు రానితప్పు? వరదా? రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౬౩

"నను శరణన్న వారలను నా పద దాసుల నొక్కసారి వే
డినఁ గృప నేల జూతు" ననె డీప్రతినల్ గల నీకు; నట్టి వా
నినె గద నేను మీదయకు నెట్టుల పాత్రుడగాక యుందు? న
న్గనని భవత్ప్రతిజ్ఞ యగునా? రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౬౪

స్వామి! త్వదీయ దివ్య పద పద్మములం దతి భక్తి కెల్ల హ
ద్దౌ మహ దాత్మ వేదిని; విదాంవరు నాథమునిన్ పితామహ
స్వామిని, నెంచి నాదు నడవళ్ళను జూడక మీ కృపన్ సుధా
ప్రేమ ననుగ్రహింపుడు హరీ! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౬౫

ఎవరి పదారవిందముల నేపగు భక్తిన సంస్మరించి నా
భవ భయ కల్మషంబులను ధ్వంసము సేయుచు వస్తుతత్త్వమున్
సవిధి నెఱింగి పొందితను స్వామిని నా ఘను యామునార్యునిన్
దవిలి నతించి నిన్ గొలిచెదన్ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౬౬

—:o:—

# విజ్ఞాపనము

## అష్టమ స్తబకము

శ్రీరమణా! కృపాభరణ!
　　శ్రీకర నామ సహస్ర సద్గుణా!
దారుణ దుర్విదగ్ధ రిపు
　　దానవ మర్దన! సజ్జనాఽవనా!
సారస పత్ర లోచన! ప్ర
　　శ స్త జగ న్నుత విశ్వకారణా!
శ్రీ రుచిరాలవాల పుర
　　శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా!

గంగవలెన్; మదైక గజ గండము తీరు; నభంబు తీరు; శౌ
ర్యాంగు సురేంద్రు తీరు స్వర రాగము తీరు; యశస్సు దాన భ
వ్యేంగిత సద్గుణంబు లరి వీర జయోద్ధతి; సత్కథాదిచే
రంగుగ వెల్గు నిన్ గనెదరా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧

ముని వరు లెల్ల నీ మధుర మోహన రూపముఁ జూచి ముగ్ధులై
"వనితలమై త్వదీయ విభవాస్పద మన్మథ కోటి రూపమున్;
తనివిగఁ బొంద నెంతు"మని తల్లడ మొంది రటయ్య! నీదు రూ
పును గన నెంతు నెట్టిదొ? విభూ! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨

నీ చరితన్ స్వరూపముల నీ గుణ సంపద నెల్ల బేర్మితో
తోచిన తీరు దృశ్య విధి తోడ్పడ శిల్ప కవిత్వ సత్కళా
శ్రీ చెలువార గొల్చిరి; విశేష కళా విదులెల్ల భక్తితో;
నే చిరుకైతఁ గొల్చితిని నిన్ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩

వేద పురాణ శాస్త్ర విభ వేడిత సల్లలితైక సత్కళా
శ్రీ ధన దీప్తులంది మిముఁ జేర నుతించి తరించి రెందఱో;
నే దయనీయ దుర్విధుల నిండిన వాఁడను; చేరు దెట్లు నిన్;
శ్రీధర! కావ వేడెదను; శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా!

నీ పద పద్మ సేవకు లనేకులు; పావని; ఋక్షరాజు; సే
వాపరుడౌ విభీషణుఁడు; వాలిసుతుండును; భాను పుత్రుడున్;
నీ పరమాప్తులౌ కపులు; నేతృచయంబులు; గొల్చుచుండ నే
నే పగిదిన్ గనుంగొనెద నిన్; రఘురామ! దయాబ్ధిచంద్రమా

నీ పద పద్మ దాసునిగ నేలిన నన్నెద పొంగి యాడ ని;
న్నేపగిదైన దంతి పయి నెక్కి యజాండము పిక్కటిల్లగా
నీ పరమైన సత్కృపల నంతట ఢంకను గొట్టి చాటెదన్
నాపయి నింత జూపు కరుణన్ రఘురామ! దయాబ్ధిచంద్రమా

ఆ గుహు పైన; భక్త శబరాంగనపైన; కపీంద్రుపైన; సే
వాఽగత భానుజాంగదుల పైన: విభీషణ వానరాళిపై
నే గతి నీ కృపన్ జిలికి నేలితి వాఘనులన్; భవత్కృపన్;
ఆగతి నాపయిన్ జిలుకురా! రఘురామ! దయాబ్ధి చంద్రమా

ఏమి తపం బొనర్చె; గుహు డేవ్రతమూనె కిరాతనారి; యే
మేమి త్వదర్చనల్ గనిరి మేటికపీంద్రులు; వారి నెల్ల ప్రే
మాఽమిత సత్కృపన్ దమ రు మాన్యత నేలితి రేమెరుంగ
రా! మది నర్పణం బిడితిరా! రఘురామ! దయాబ్ధిచంద్రమా

ఎందఱొ భక్త వర్యులు మఱెందఱొ సల్లలితైక సత్కళా
సుందర చిత్తు లెంతగనొ చొక్కపు భక్తిన గొల్చి మీ కృప
మందత నంది వెల్గిర సమర్థుడ నిన్ గనలేను; కాని నిన్
జెందె మనమ్ము కావుముర! శ్రీరఘురామ! దయాబ్ధి చంద్రమ

చక్కని వాడ వంచు; కృప సంధిలు చల్లని చూపులెల్ల పెం
పెక్కిన వాడ వంచు; కడు పేర్మి త్వదంఘ్రుల నమ్మువారి జే
జిక్కిన వాడ వంచు; నినుఁ జేరగ నే శరణంచు మ్రొక్కితిన్
చక్కగ నేలు నన్ను మనసై; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౦

అడుగను నిన్ను భోజ్యముల; నాయువు; వస్త్రము స్వాస్థ్యసంపదన్;
కడు ధనరాశులన్; యశము గల్గెడి భౌతిక మైన కోర్కెలన్;
పడి పడి వేడ నిన్నెపుడు భక్తిన మీ పద సేవ గూర్పు మం
చడిగెద నేఁ దరింప మనసై; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౧

మీ పద దాస దాసులఁ దమిన్ దరిఁజేరి తదీయ సేవలో
ప్రాపని చేరి యున్న పశు పక్షి మనుష్యులు స్థావరాదులున్
శ్రీపతి! తావకాంఘ్రులను జేరి రటంచు త్వదీయ దాసులన్
దాపని కొల్తు నిన్నువరదా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౨

సాధకు లైన వారలకు సర్వులఁ గొల్చుట కంటె వైష్ణవా
రాధన మేలు నందున సరైన తదీయుల యోగ్య మైన యా
రాధన మేలు మేలనుచు రక్తిన భక్తిన తావకీనులన్
శ్రీధర! కొల్చి నిన్గొలుతు శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౩

శాశ్వత ముక్తి దాత యిల సర్వుల కంటెను విష్ణువైన స
ర్వేశ్వరుడౌ పరాత్పరుడు విశ్వ హితుం డగు నారనాఖ్యుడే
యీశ్వరు డంచు గొల్చి విబుధేశుల యిండ్ల జనించువాడె మో
క్షేశ్వర పాత్రు డౌను గద; శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౪

ప్రణవ విశేష శోభితుని భవ్య కషాయిత ఖండ వస్త్రి ను
ద్గుణుని త్రిదండి వర్యుఁ త్రివిదోజ్జ్వల తాత్విక సాధుధర్మభూ
షణుని దయార్ద్రి లోచనుని సత్పథ వాదిని రామసోదరున్
ప్రణుతిన వేడి నిన్గొలుతురా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౫

సాహస శౌర్య వీరతల జాటు పరాక్రమ సత్వ దీప్తిచే
ద్రోహుల రావణాదుల మదోద్ధతి నారఁగ జేసి నట్టి స
ద్బాహుబలా! జయోఽస్తు భవ దంబుద నీల శరీర లక్ష్మికి
వ్వే హిత మంగళాలు గొనవే! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౬

మీ పద పద్మ సంపదకు; మీ తను లక్ష్మికి; మీ కృపాది స
ద్దీపిత సద్గుణాళికి; సతీమణి జానకికిన్; త్వదీయమౌ
చాప మహాస్త్ర శస్త్ర శరజాలము కెల్ల ననేక వేలపై
శ్రీపద మంగళంబు లగు శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౭

శ్రీ రమసీత డెందమునఁ జిందులు ద్రొక్కెడి మీ పదారవిం
దారుణ రమ్య లక్ష్మికి; శతాధిక కోటి సహస్ర వర్షముల్
శ్రీ రుచి రైక రక్షణ విశేషపు మంగళ సిద్ధు లౌత! దై
త్యారి! జయంబు లౌత! వరదా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౮

కాల విశేష తత్వములు గల్గెడి దాకనె మాకు మీకు నె
వ్వేళ వియోగ దుఃఖములు వేడ్కన నైనను గల్గరాదు మీ
చౌ లలితైక వక్షమునఁ దాల్మినఁ జక్కదనాల గుల్కు నా
శ్రీలతకౌత! మంగళము శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౧౯

అరి కుల కంఠ లుంఠన పరాయణమౌచు స్ఫుర త్సహస్ర స
త్కిరణ విశాల చక్రమునకే జయమౌత! త్వదీయ వైరిదు
ర్భరమగు గుండియల్ సెదర రావమొనర్చెడి శంఖరాజమే
స్థిర జయ లక్ష్మిఁ గన్గొనుత! శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౦

శ్రీకర మైన మీ యెదనఁ జెన్నలరారెడు కౌస్తుభంబునన్
సోకలరార మేల్సిరుల శోభిలు మీ గృహలక్ష్మి కెయ్యెడన్
శ్రీకిరవౌ శుభంబులును జెల్వగు మంగళముల్ సెలంగుతన్!
మీకగు మంగళంబు లెలమిన్; రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౧

మాధవ! తావకీనులగు మాకును మీకు గలట్టి నిత్యస
త్యాదరమైన ప్రేమలకు; త్వల్లలితోద్య దురస్థ లక్ష్మికిన్;
మీదగు చాపబాణముల మేలిమి సంపదకున్ శుభంబులౌ;
ఆదరణీయ భోగములునౌ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౨

పలు విషయంబులం దనుభవంబుల నొందుచు కల్మి లేములం
గలిగిన గాని ధీరులు జగత్పతి పాదములన్ త్యజింపలే
రిల నటి నాట్య తాళ లయ రీతులలోఁ దల నున్న కుంభమున్
దలచుచు పీఠ కుండును గదా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౩

పరమ పవిత్రులందు హరి భవ్య పవిత్రుడు; మంగళంబులం
దరుదగు మంగళంబ తఁడె; దైవము దివ్యుల కెల్ల నాతడే;
ధరఁ గల ప్రాణి కోటులకు దల్లియు దండ్రియు నాతడే గదా!
అరయగ వాడె నీవు గదరా; రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౪

శ్రీ యిన వంశ సోమ! సరసీరుహ నేత్ర విలాస సీమ; నా
రాయణ తత్వ పౌర్ణిమ! పరాత్పర దీవ్య దనన్య నామ! ల
క్ష్మ్యాఽయతనైక వక్షమ! నిరాశ్రయ భక్త సురద్రుమా!కృపల్
మాయక నన్ను నేల గనుమా రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౫

రామ! నృశంస రాక్షస విరామ! జగద్ధిత దివ్యనామ! సీ
తా మధురాంతరంగ నవ తామరసైక నట న్మిళిందమా!
కామిత దాన వీర గుణ గర్భిత మానసమా! బుధోత్తమా!
క్షేమ మొసంగు దాసుడను; శ్రీరఘురామ! దయాబ్ధి చంద్రమా! ౨౬

మధురము నీస్వరూపములు మాగిన తేనెలె నీ మృదూక్తులున్
మధురము లౌను నీ కథలు మాయని తీయదనాలె నీకృపల్;
మధురము నీగుణాఽమృతము; మాధురులే భవదీయ నామముల్
మధురము తావకీన మహిమల్ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౨౭

చండ మయూఖ వంశ కలశాంబుధి పూర్ణ శశాంక మూర్తి! ఆ
ఖండల తుల్య దీప్తి మదఖండ పరాక్రమ శాలి! దివ్య కో
దండ ధరాఽభిరామ! శ్రిత దాస జనాఽవన సత్యకామ! ఓ
ఖండన భీమ! నన్ను గనవా? రఘురామ! దయాబ్ధిచంద్రమా!

ద్రావిత దుర్విదగ్ధ కుపథాశ్రయ దైత్య గణా! ప్రపన్న లో
కాఽవన! జానకీ హృదయ కంజ మిళింద వరేణ్య! సద్గుణా!
పావన నామ భూషణ! అపార కృపాఽమృత వార్ధిచారణా!
బ్రోవవె! నన్ శ్రితాఽవన! విభూ! రఘురామ! దయాబ్ధిచంద్రమ

యమ నియమాది సత్వ గుణ యౌగిక మానస రాజహంసమా!
విమల తపో విశేష బహు విత్తమ! కీర్తిత కీర్తి సత్తమా!
సమద గజేంద్ర ధీరతమ సద్గమనాఽశ్రయ చారు సీమ! శ్రీ
రమణ! నతింతు బ్రోవ గనరా! రఘురామ! దయాబ్ధిచంద్రమా

నళిన దళాఽయతేక్షణ! అనన్య కృపా పరిపూర్ణ లోచనా!
లలిత ఘనాఘ నోజ్జ్వల విలక్షణ నీల శరీర లక్షణా!
విలసిత భక్త వత్సల వివేక వివర్ధన! నిన్నుఁ జేరితిన్;
చెలిమిన గొల్చితిన్ గనవె! శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా!

మహా దనవద్య తాత్వికుల మౌనుల మానస పద్మ లక్ష్మికే
విహిత మనోజ భావముల వెల్గగఁ జేసెడి మన్మథుండవై
బహు విధ దివ్య మూర్తి వయి భాసిలు నిన్నెద గోరి చేరితిన్
ఇహ పర సౌఖ్య మిచ్చి గనవే! రఘురామ! దయాబ్ధి చంద్రమా

మధురము తావకాకృతులు మాగిన తేనెలె నీదు నామముల్
మధురము త్వద్గుణావళులు మాధురులౌ భవదీయ సత్కృపల్
మధురము నీ మనోజ్ఞతమ మైన మనస్సు; త్వదీయ గానముల్
మధుర ధురాతి మాధురులె; మా రఘురామ! దయాబ్ధిచంద్రమ

నీ విధు లన్న మిన్న; కడు నిర్మలమౌ భవ దీయ కీర్తియే
యే విధి జూడ మిన్న; వినయేడిత వర్ధిత ధర్మ పాలనం
బే వినుతింప మిన్న; యెలమిన్ గన మీ శరణాగతాఽవనం
బే విన మిన్న మిన్నగుఁ దమిన్ రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౪

మామిడి పండ్ల కన్న కడు మాగిన చిన్నని తేనె కన్న; నిం
పై మితి మీరు తీపిగల మేలిమి ద్రాక్ష రసాల కన్న; పెం
పౌ మధువొల్కు మే లరటి పండ్ల రసంబుల కన్న మిన్న; మీ
శ్రీ మధురైక నామములు; శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౫

ధర్మ విరుద్ధులౌ దురిత దానవులన్ బరిమార్ప వీర స
త్కర్మ లొనర్ప తీక్ష్ణత నెదన్ గలిగుందువు; నార్త భక్త స
ద్ధార్మిక రక్షణంబున సదా నవనీతమె నీమనంబు; దు
ష్కర్మ లవిత్ర! బ్రోవు మనఘా! రఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౬

నీ విట మానవాకృతిన నిమ్మహి దుష్టుల గూల్ప శిష్టులన్
గావగ నిల్చి ధర్మముల గాచితి వంట త్వదీయ కీర్తి విం
తై వెలుగొందె; బ్రోవు నను; తావక దాసుల దాస దాసుడన్
శ్రీ వినుతాఽలవాలపుర శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౭

శ్రీ మను వంశ వారినిధి శీతల పూర్ణ శశాంక! ధర్మదీ
క్షా మహనీయ వీర పురుషా! కలి నాశక నామ రూప! రా
మా! మహిజా మనోహర! సమాహిత దివ్య శరాసనోజ్జ్వలా!
[1]క్షేమ మొసంగు నిన్గొలుతు! శ్రీరఘురామ! దయాబ్ధిచంద్రమా! ౩౮

(మంగళము)

మంగళ మౌత! విశ్వ మయమౌ జనయిత్రికి భారతాంబకున్
మంగళ మౌత! తల్లి యగు మన్మహితాంధ్ర రమా లలామకున్
మంగళ మౌత! సత్ప్రజకు; మంగళ మొప్పుత గోర్విజాదికిన్
మంగళ మౌత! నేతలకు; మా రఘురామ! దయాబ్ధి చంద్రమా! ౩౯

---

1 శ్రీ మహిమాలవాలపుర.

:- ఫలశ్రుతి :-

ఎవ్వరు నీ కృతిన్ శుచిన నెమ్మది గల్గిన జ్ఞాన భక్తిచే
ఎవ్విది సంస్మరించిన పఠించిన విన్నను[1] జెప్పుచున్ననున్
అవ్వినుతాత్ములౌ నరుల కారు నఘంబులు ముక్తి గల్గు; పెం
దవ్వల కొద్ది రవ్వలె సదా! రఘురామ! దయాబ్ధిచంద్రమా!

శ్రీశుభమస్తు

సర్వం శ్రీ ప్రాచీనాలవాల పురాధీశ్వర శ్రీ సీతా లక్ష్మణ హనుమత్సమేత శ్రీరామచంద్ర పరబ్రహ్మ పాదార్పణమస్తు

ఇయ్యది

శ్రీ భారద్వాజ గోత్ర పవిత్ర శ్రీ నల్లదిగ వంశోదధి పూర్ణ శశాంకాయ మాన శ్రీ నరసింహదేశికచూడామణీపుత్ర; భగవద్భాగవతాచార్య విధేయ బంధు హిత పుత్ర కళత్రాది సహృదయ సుహృజ్జనానుకూల హిత; శ్రీలక్ష్మీ హయవదన కృపా పాత్ర శ్రీరాధికామనోహరీయాది ప్రబంధ నిర్మాణ దక్ష కవితాకోవి దేత్యాది బిరుదాంకిత శ్రీనివాస కవిదాసు విరచిత శ్రీరఘురామ కుశేశయ ప్రబంధమ్మను స్తుతి వైజన్తి ప్రాచీనాలవాలపుర శ్రీ సీతా లక్ష్మణ హనుమత్సమేత శ్రీ రామచంద్ర స్వామి వారి పాద పద్మార్పణంబై ముగిసినది.

ఓం తత్సత్

శ్రీః శ్రీః శ్రీః

శ్రీశుభం భవతు.

---

1. జెప్పుచుండినన్.

శ్రీః

శ్రీ లక్ష్మీ హయవదన పరబ్రహ్మణే నమః

శ్రీ మహా సరస్వత్యై నమః

శ్రీ సీతాలక్ష్మణ హనుమత్సమేత శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

శ్రీ గోదావరీ నదీతీరోపాంత

శ్రీరామసాగర పుర (పోచంపాడు) విలసిత

# శ్రీ రఘూత్తమ-స్తుతివైజయన్తి

(శ్రీ కుశేశయ ప్రబంధము)

రచయిత

శ్రీమాన్ నల్లదీగ శ్రీనివాసాచార్యులు

శ్రీ యువ - మధుమాసములు

1995

శ్రీరస్తు శ్రీః శుభమస్తు

శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీ మహా సరస్వత్యై నమః

శ్రీ సీతాలక్ష్మణానిలజసమేత శ్రీ రఘూత్తమ స్వామినే నమః

(శ్రీ పోచంపాడ్ శ్రీరామసాగర పుర విలసిత)

# శ్రీ రఘూత్తమ-స్తుతివైజయన్తి

## (శ్రీ కుశేశయ ప్రబంధము)

గోదావరీ సురనదీ తట రమ్య దేశే
శ్రీరామ సాగర పురీ వర మందిరేఽస్మిన్
శ్రీ లక్ష్మణాఽనిలజ సేవిత పాద పద్మం
సీతాపతిం రఘుపతిం ప్రణమామి నిత్యమ్.

సౌందర్య సార జలధిం కరుణాంతరంగం
ధర్మావతార మనవద్య గుణాభిరామం।
కోదండ దివ్య శర మండిత హస్త యుగ్మం
శ్రీరామ సాగర విభుం ప్రణమామి రామమ్॥

శ్రీ

# కోదండ రామచంద్రస్వామి దేవస్థానము

## శ్రీరామసాగర్ (పోచంపాడు) ప్రాజెక్టు నిజామాబాదు జి॥



శ్రీ సీతాలక్ష్మణహనుమత్సమేత శ్రీ కోదండస్వామివారు

### కృతిపతి

శ్రీ నీల నీరద మనోహర దివ్య దేహం
సు స్మేర పద్మ నయనం ధరణీ సుతాఢ్యం
సౌమిత్రి వాయుజ హితం ధృత చాప బాణం
శ్రీరామ సాగర విభుం ప్రణమామి రామమ్॥

శ్రీరఘూత్తమస్తుతివైజయన్తి

# విషయసూచిక

శ్రీః
శ్రీయైనమః

# ఆశీస్సులు

—డా॥ శ్రీ శుకశ్రీ

శ్రీ కుశేశయప్రబంధాంకిత సందర్భమున

ప్రభవ సంవత్సర చై॥ శు॥ సప్తమీ భానువారము పోచమ పాట్పురాధీశుడైన శ్రీ రామసాగర తీరోపాంత హరిత ప్రదేశ సుందర మందిరస్థుడైన శరణాగత వత్సల బిరుదాంకితుండైన కరుణాసముంద్రుం డైన శ్రీ సీతా లక్ష్మణ హనుమత్సమేత శ్రీ కోదండరామచంద్రస్వామివారి పాదపద్మములందు భక్తిపూర్వకముగా సరససాహిత్య సహృదయ శిఖా మణులైన పెద్దలైనవా రేర్పరచిన సర్వ కార్యక్రమమున శ్రీ రఘూ త్తమ కుశేశయ ప్రబంధ కృతి సమర్పణోత్సవ సందర్భమున సభాధ్య క్షులుగా నైన నేను మనోవికాసముతో ప్రేమార్ద్రి భావముతో మా మిత్రునికి నందించిన శుభాశీస్సులు.

నలదీగ శ్రీనివాసుల
సలలిత కవితా సుధారసముగ్రోలంగన్
వలచియు రఘుపతి దానిం
పలరగ పోచమ్మవాటి నధివసియించెన్॥

ప్రభవ॥ చై॥ శు॥ 2॥
భానువారము
తేది. 5-4-1987.

శుకశ్రీ
మంథిని

శ్రీః

శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీ సరస్వత్యై నమః

శ్రీ సీతా లక్ష్మణ హనుమత్సమేత శ్రీరామచంద్రస్వామినే

శ్రీగౌతమీ తటీ తీరే - శ్రీరామ స్సీతయా సహ
వర్ధతాం వర్ధతాం నిత్యం - వర్ధతా మభివర్ధతామ్॥

శ్రీసీతా మృదు మాధుర్య - చారు చిత్తాబ్జ షట్పదః।
శ్రీరామ చంద్రో జయతాం - భక్తచింతామణిర్విభుః॥

శ్రీః

శ్రీ సీతారామచంద్రస్వామినే నమః

# శ్రీరామచంద్ర స్తోత్రమ్

శ్రీరామ సాగర తటే నుతమందిరేఽస్మిన్
సీతామనోహరవిభుశ్శ్రితపారిజాతః।
శ్రీలక్ష్మణాఽనిలజ సేవిత నీరజాంఘ్రిః
కోదండ రాఘవ పతి ర్హృది మే చకాస్తు॥

శ్రీరామ సాగర పురీ వర మంది రేశః
శ్రీ గౌతమీ సుర నదీ పరిసేవితాంఘ్రిః
సీతా మనోజ్ఞాఽనన పద్మ భృంగః
చకాస్తు మే చేతసి రాఘవచంద్రః॥

శ్రీరామ చంద్రం శ్రిత కల్ప భూజం
శ్రీ గౌతమీ తీర నికేతనాఢ్యం।
సౌమిత్రి వాతాత్మజ సేవితాంఘ్రిం
నమా మ్యహం రాఘవరామచంద్రమ్॥

మంద స్మితాఽనంద ముఖేందు బింబం
మాధుర్య రమ్య ప్రియ దివ్య మూర్తిం
యోగీశ్వరాఽనంద హృదబ్జ భృంగం
నమామి సీతాపతి మప్రమేయమ్॥

కారుణ్య పూర్ణ కమలాయత ముగ్ధనేత్రం।
శ్రీవత్స చిహ్న వర దీవ్య దురస్థలాఢ్యం
సౌందర్య సార జిత మన్మధ కోటి రూపం
నౌమి ప్రపన్న నుత రాఘవ రామ చంద్రమ్॥ ౫

శ్రీరాఘవాఽన్వయ మనోహర రత్న దీపం
దుర్దైత్య నాశక మహోద్ధృత ధీర శౌర్యం।
భక్తాఽభయ ప్రద శుభప్రద హస్త పద్మం
నౌమి ప్రపన్న నుత రాఘవ రామ భద్రమ్॥ ౬

మౌనీంద్ర మానస విహార మనోజ్ఞ హంసం।
భక్తాంతరంగ నవ పంకజ కుంజ వాసం॥
కల్యాణ కృల్లలిత సద్గుణ భద్ర రూపం
నౌమి ప్రపన్న జన సన్నుత రాఘవేంద్రమ్॥ ౭

శ్రీమ త్త్రిదండి యతిరా ద్వర దేశికాగ్రైః।
నారాయణాఖ్య పెదజీయ్యరు పూజ్య పాదైః॥
సమ్య క్ప్రతిష్ఠిత జగ న్నుత సుందరాంగం।
శ్రీరామచంద్ర మనిశం ప్రణమామి దేవమ్॥ ౮

ఇదం సుజన సేవితం పరమ భక్త సంసేవకం।
భవాంబునిధి తారకం దురిత దైత్య లోకాంతకం॥
మదీయ హృదయాంబుజే రఘుకులేశ పాద ద్వయం।
సదా లసతు సీతయా రహసి చుంబనై స్సేవితమ్॥ ౯

—: ౦ :—

శ్రీః

శ్రీరస్తు　　　　శ్రీ హయగ్రీవాయ నమః　　　　శుభమస్తు

శ్రీ సరస్వత్యై నమః

శ్రీ సీతాలక్ష్మణహనుమత్సమేత శ్రీ కోదండరామచంద్ర

పరబ్రహ్మణే నమః

# కృతి సమర్పణము

ఎందఱొ మేల్మి సంపదల నేపయి వెల్గిన వారు త్యాగులై
మందిర వైభవాదుల సమర్పణజేసి తరించినారు, నే
నెందున లేమి నేమిడుదు? నీ దయ గల్గిన చంప కోత్పలా
లొందిన యీ కృతిన్ రవికులోత్తమ! నీ కిడితిన్ రఘూత్తమా! ౧

అనుపమ మైన కానుకల నందఁగ జేయుచు భక్తు లెందరో
నిను ననిశంబు గొల్చి మది నెన్నుచు భక్తిఁ దరించు చుందురెం
దునఁ గడు లేమి నైతి నెటు దోపక నీకృతి నిచ్చుకొంటి చం
ద్రుని కొక నూలు పోగటు లిదో! కొని యేలుము నన్ రఘూత్తమా! ౨

కళలు భవ త్కృపారసము గల్గిన గల్గును; శ్రీకవిత్వ స
త్కళయన మీ విశిష్ట గుణ గర్భిత సత్కరుణాంతరంగమే
కలిగిన వాని కబ్బు నని గంటిని యీ కవితా కృతీందిరన్
చెలువయు మీర మీ కిడితి చేకొని బ్రోవవె! శ్రీరఘూత్తమా! ౩

ఇతిశయమ్

సర్వము శ్రీరామచంద్ర పాదార్పణమస్తు

శుభం భవతు.

శ్రీః

శ్రీ సీతా　　　శ్రీ హయగ్రీవాయ నమః　　　రామాభ్యాం నమః

సరస్వత్యై నమః

# శ్రీ రఘూత్తమ-స్తుతివైజయన్తి

శ్రీరమ కైన మందసము;
చిద్గగనోజ్జ్వల దివ్య సద్గుణాఽ
ధార నుతాఽతసీ సుమ వి
తాన సమాశ్రయము; వేద వేద్య ది
వ్యోరు జగ త్స్వరూపము, శు
భోన్నతమౌ పరతత్వ రూప మీ
వై రహి వెల్గు చుందు వని
ప్రస్తుతిఁ జేతుర! శ్రీరఘూత్తమా॥

శ్రీ రఘు వంశ సోమ! వివశీ కృత మౌని హృదబ్జ సీమ! సీ
తా రమణీ మనో విమల తామరసాఽళి లలామ! దివ్య శృం
గార కళాభిరామ! రిపు కంఠ విలుంఠన శౌర్య ధామ! ఓ
శ్రీరత రామసాగర పురీవర నత్తమ! శ్రీ రఘూత్తమా! ౧

శ్రీ రమణీయ సద్గుణ సుశీల! విశేష యశో విశాల! బృం
దారక సజ్జనాది వినుతాదర శౌర్య రమాఽలవాల! దో
స్సార రిపు ఘ్న చాప శర జాల! తపోధన యోగి రాజ హృ
న్నీరజ ఖేల! నన్ను కరుణింపవె! పోచమపాట్ రఘూత్తమా! ౨

శ్రీ మధురైక నామ! అతసీ సుమ కోమల నీల నీరద
శ్యామ! సితాఽయతాబ్జ దళ చారు లస న్నయనాఽభిరామ! ది
వ్యాఽమృత పూర్ణ మంజుల కృపాఽకర మానస భవ్య సీమ! శ్రీ
రామ! గుణాఽభిరామ! జయ రామ! దయన్ గనవే! రఘూత్తమా! ౩

మా సుకుమార మార సుకుమార! ఘనా ఘన నీల సుందరా!
వాసవ దివ్య ముఖ్య నుత భాసుర మేరు సుధీర! బాణ బా
ణాసన శోభి తోన్నత గుణాఽకర దోర్బల వీర! శూర! రా
రా! సుజనాఽర్తి హార! దయ రాదుర! నన్గనరా! రఘూత్తమా! ౪

శ్రీ జనకాఽత్మజా సరస శీతల మానస రాజ హంస! సం
పూజిత యోగి రాజ కుల ఫుల్ల హృదబ్జ రిరంస! సజ్జనో
త్తేజ కృత ప్రశంస! హృత దృప్త ఖలాఽసుర దుర్నృశంస! వి
భ్రాజిత కీర్తనీయ గుణ భాస్కర వంశ! నతుల్ రఘూత్తమా! ౫

బాల సువర్ణ చేల! పరిపాలిత కింకర భక్త జాల! నీ
లాలక లాలితోన్నత విలాస విశాల మనోజ్ఞ ఫాల! హే
లాలస సుస్మితాలయ విలక్షణ పూర్ణ ముఖేందు మండలా!
లాలిత సత్కృపా మృదు కళా! నను బ్రోవవె! శ్రీ రఘూత్తమా! ౬

మధుర వచో రసాల! సిత మంజుల నీరజ దృగ్విశాల! శ్రీ
సదన గుణాఽనుకూల! భవ సాగర తారక నామ జాల! స
న్మృదుల మనోజ్ఞ మానస వినిర్మల వత్సలతా గుణోజ్జ్వలా!
బుధ నుత చారు శీల! దయఁ బూనవె నాపయి శ్రీ రఘూత్తమా! ౭

అనుపమ కీర్తి తేజ! విబుధాఽదిదిశాంపతి భూమి దేవతా
ద్యనఘ నుతాఽంఘ్రి నీరజ! విదాం వర మానిత రామ రాజ! స
న్ముని జన మోహితాంబుధర ముగ్ధ తనూజ్జ్వల రాణ్మనోజ! శ్రీ
యినకుల వార్ధి రాజ! కరుణింపవె! దాసుని శ్రీ రఘూత్తమా! ౮

శారద నీర దేందు ఘనసార సితాంబుజ మంద హాస! స
త్సారస చారు కోమల విశాల కృపాఽకర దృగ్విలాస! వం
దారు జనాఽవనాఽభయద ధర్మ కరాబ్జ విశేష భాస! సం
సార కుకర్మనాశ! మనసారగ గోరితి నిన్ రఘూత్తమా! ౯

రంగ దళంగ నీల రుచి రాంబు ధరాంగ! యనంగ కోటి రూ
పాంగ! యపాంగ సంగత కృపాబ్ధి తరంగిత దృక్తరంగ! ది
వ్యాంగ! దయాంతరంగ! నుత భక్త హృదబ్జ విహార భృంగ! శ్రీ
రంగ! ననుం గనంగ దయ రాదుర? మ్రొక్కెద శ్రీ రఘూత్తమా!౧౦

(లక్ష్మీస్తుతి)

అనుపమ లోక రక్షకుడవై భువనంబుల నిండి యున్న నిన్
మననము జేసి; నీ హృదయ మందనపాయిని యౌచు వెల్గు నా
యనఘ చరిత్రురాలయిన నబ్ధి కుమారిని శ్రీ సతీ మణిన్;
మనమున నెన్ని నిన్గొలుతు మాన్యుడ! నన్గనవే! రఘూత్తమా! ౧౧

(బ్రహ్మ-పురారి)

నాలుగు మోములన్ నిగమ నాదము లుప్పతిలంగ బల్కుచున్
ఈ లలితైక విశ్వముల నింపున సృష్టి యొనర్చు నాయజున్;
కాలుని కాలుడై త్రిపుర ఘస్మరుడై కడు పేరు గన్న నా
శూలిని వేడి నిన్గొలుతు సూనృత వాఙ్నిధి! శ్రీ రఘూత్తమా! ౧౨

(సరస్వతి)

కలుముల తల్లి కోడలిని కచ్ఛపి వీణియ పుస్తకాఽక్ష మా
లలు చెలువొందు కేల్సొగసు లందిన మేల్సుగుణాల వల్లినా
నలువ వెలందినిన్ మదిని నమ్మిన భక్తుల కల్ప వల్లి నిన్
పలుకుల తల్లినే గొలిచి పల్కెద నర్మిలి నిన్ రఘూత్తమా! ౧౩

(సర్వమంగళ)

అమ్మల గన్న యమ్మ యయి యన్నుల మిన్నగ వెల్గి శూలి దే
హమ్మున నర్ధ మందొనర హాయిగ నిల్చి జగ ద్విశిష్టులౌ;
నమ్మిన భక్త కోటుల ఘనంబుగ నేలెడి యన్నపూర్ణ గౌ
రమ్మను గొల్చి నిన్ గొలుతురా! కరుణింపవె! శ్రీ రఘూత్తమా! ౧౪

(మాతాపితలు - గురుదేవులు)

సతతము చూడమా నృహరి సాధు సుతాఽఽత్మల సౌమ్యులైన మ
త్పితరుల పాద పద్మముల బేర్మిన నెమ్మది నిల్పి కొల్చుచున్
స్తుత మతి పూరుషోత్తముని సూరివతార్య గురున్ దలంచి నిన్
కృత మతినై నుతింతు పరికింపుము నన్ కృపతో రఘూత్తమా! ౧౫

(పూర్వకవులు)

విలసిత కీర్తి మంతుల కవిత్రయులన్, కవిసార్వభౌములన్
లలిత వచో రసాల కవులై విలసిల్లెడి పోతనాదులన్;
వెలుగు ఘనాష్టది గ్గజ కవీంద్రుల భక్తిన నాత్మ నెన్ని; నా
పలుకు కొలంది పల్కెదను పల్కగ జేయవె నన్ రఘూత్తమా! ౧౬

ఉరుగుణి విశ్వనాథ కవి నుత్పలవారిని వాక్సుపుత్రునిన్;
అరమర లేని మేటి గడియారము శేష కవీంద్రు, వాక్పతిన్;
వరదకవీశుదాశరథి వాగ్విభవున్ మరిగంటి సత్కవీ
శ్వరుల దలంచి నిన్గొలుతు పార్థివ చంద్రమ! శ్రీ రఘూత్తమా! ౧౭

వినుత యశో విశాలు రగు విద్య నొసంగిన మామ కీనులౌ
ననఘ గురూత్తమార్యులకు నర్మిలి మ్రొక్కి యనుంగు మిత్రులై
తనరిన సత్కవీశ వరదార్యుల నాది కవిప్రకాండులన్
మననము జేసి నెమ్మదిని మాన్యుడ! పల్కెదు నిన్ రఘూత్తమా! ౧౮

(ఛందోకవిత)

ఏ విధిఁ జూడ సత్కవిత కింపొనరించును శాస్త్ర దీప్తి ఛం
దోవిదు లబ్బగా కవిత దోషము బాసి వినూత్న రమ్యమై
దైవత సిద్ధి గాంచు, నిది తథ్య మటంచు నెఱుంగ రల్పదు
ర్భావుకు లజ్ఞు లన్యులు పరాత్పర! పోచమపాట్ రఘూత్తమా! ౧౯

ఏ విధమైన శాస్త్రముల నింతఁ గనుంగొనలేని యల్పదు
ర్భావుకులైన దుర్మతులు భద్రత గూర్చెదు రమ్యమైన ఛం
దో విధి నీసడింతు రతి దుర్విధులై యసమర్థు లట్లు యే
భావములైన శాస్త్ర విధి పర్విన సొంపగురా! రఘూత్తమా! ౨౦

నిగమపు రత్న నీరధులు నిన్గన నీయ వగాధ రూపమై;
నెగడిన సత్పురాణము లనేక విధంబుల వేటకాండ్రునై
తగ నెఱిగింప లేవు నిను, ధర్మము లన్యము లెట్లు దెల్పురా!
సుగుణ విశాల! నీవెఱుగఁ జూపిన జూచెద నిన్ రఘూత్తమా! ౨౧

ఉపనిష దుద్వనంబులఁ బ్రమోదముతో విహరించు దేవ! దు
ష్కృపథ చరైక ముష్కరుల గూల్చి జగద్ధిత భక్తలోకమున్
కృప లిడి బ్రోచు మీమహిమ కీర్తుల నెంతటి వాడ నల్పుడన్;
నెపమున బల్కు జేసినను నిన్ దగ బల్కెదరా! రఘూత్తమా! ౨౨

శేషుడు నైన దేవ గురు శేఖరుడైనను బ్రహ్మ యైన స
ద్భాషిణియౌ జగద్వినుత భారతి యైనను; సాధు సత్కృపో
ద్భూషిత మైన నీ యశము బూని వచింపఁగ లేరటయ్య! శ్రీ
భూషణ! యెట్లు నిన్ బలుకఁ బూనుదు? తోడ్పడవే! రఘూత్తమా! ౨౩

పలుకున దిద్ది మాధురులు బర్వెడు నీదగు నామమంట; నీ
సులలిత సత్కృపా సరళి పోకగఁ జేయుచు నన్ను నీవె బల్
పలుకగ జేతువంట! భవ బాధ లడంగగ జేయ నిన్ను నే
పలుకుదునంట యన్యముల బల్కిన వమ్మటరా! రఘూత్తమా! ౨౪

నీ లలితైక సత్కథల నేర్పు నెఱింగి వచింప చిత్రమా
శూలికి తమ్మి చూలికిని సూనృత వాణికి; నైన నీ కృపల్
చాల వెలుంగ పండితుల సన్నిధులన్ విని తెల్సికొన్న నీ
శీల లస ద్గుణోన్నత విశేషములన్ దలతున్; రఘూత్తమా! ౨౫

(కవితావైశిష్ట్యము)

లలితము లైన లక్షణ విలక్షణ మొప్పు కళా స్రవంతిలో
విలసిత మౌచు నూత్న మయి వెల్గును సత్కవితా కళన్న, నీ
జలజ పద ద్వయిన్ నిలుప జాలిన నయ్యది సార్థకంబె య
న్యులకు నొసంగ సత్కవిత యోగ్యతఁ బాయునురా! రఘూత్తమా! ౨౬

విశ్వము నెల్ల శ్రేయమున వెల్గగ జేసెడి మీపదంబులన్
శాశ్వత మౌచు నిల్చినను సార్థకమౌ కవితా కళెప్పుడున్
విశ్వస నీయ మోక్షపథ వీథి జరించు కవీశు దర్శిలిన్;
విశ్వ నుతుండు నై మెలఁగు వేడ్కన, నిక్కమురా! రఘూత్తమా! ౨౭

లలిత రసాఽలవాల మృదు లాంచిత బాల రసాల పల్లవో
ద్విలసిత కోమలాఽమృత పవిత్ర కవిత్వ కళా సుకన్యకన్
ఖలులకు నిచ్చి తొత్తు కొడుకై మని యుండుట కన్న సత్కవై
మె లఁగెడు వాఁడు నుంచ కుల వృత్తిన మెల్గుట మేల్ రఘూత్తమా! ౨౮

మీ మృదు సత్కృపా సరళి మీరగ గల్గిన స్వల్పమైన నీ
నా మది వెల్గు సత్కవిత నాశ్రితవత్సల! మీ పదాబ్జ స
త్సీమల భక్తి భావములు సేరఁగ వెల్గగ జేయ గోరితిన్;
ప్రేమ నొసంగు సూక్తులను వేడుదురా! నిను శ్రీ రఘూత్తమా! ౨౯

(అన్యుల మాటలు)

అందురు కొంద ఱిమ్మహని నల్పమతుల్ రఘురాము నాది నుం
డెందఱొ కొల్చు గొల్చి రతడేన? మఱెవ్వరు లేరటంద్రు; వెం
పొంద భుజించు నన్నమును బూని భుజించడె నిత్యమన్నమం
దెందున ద్వేషియై మనునె? ధీమతు డిమ్మహి శ్రీరఘూత్తమా! ౩౦

ఈ రఘుమూర్తి కీర్తనల నేమరు బల్కు సుఖంబు లేదటం
చోరుపు లేని వారలు కుచోద్యము లాడిన నేమి? చేయు సం
సారము నిత్యమున్ మరల సమ్మతిఁ జేయుట లేదె? సౌఖ్యసం
భారము నొందదే నరుడు? పాయునె తుష్టిని? శ్రీరఘూత్తమా!

(రామకథ)

రామ కథానుకీర్తన పరంపర లెల్లపు డాత్మ కింపులై;
కోమల గోస్తనీ మధుర గుంభిత దివ్య సుధా స్రవంతులై;
యీ మహి సంతతమ్ము ప్రవహింపగ; తద్రస తృప్తులైన వా
రేమియు నన్యమౌ చవుల రీతుల నానరుగా! రఘూత్తమా!

శ్రీ కిరవైన సద్గుణ విశేషము లొప్పు భవ ద్గుణాల, వా
ల్మీకి మహర్షి దివ్య తప మొన్నఁగ జేసి రసామృతమ్ములో
ప్రాకట మొప్ప గంటమును బల్మరు ముంచి రచింప నిత్యా శ
ఖా కమనీయ మాధురులు పర్వెను మీ కథ శ్రీ రఘూత్తమా!

రాణువ మొప్పగా విమల రమ్య నవామృత పూర్ణ విశ్వక
ల్యాణ కరైక సద్గుణ విలక్షణమౌ భవదీయ సత్కథల్;
ప్రాణి హితంకరంబులని భక్తిన పోతన మీ కృపాప్తిచే
జాణత మీర మీరచన నల్పి తరించె గదా! రఘూత్తమా!

చారు తరైక సాల సరసాల రసాల సుమాల దివ్య మం
దార వనాల జాలముల దాల్మి రమించెడు భృంగజాల మే
తీరు నిరస్త గంధముల దేలు సుమంబుల జేరునయ్య? నిం
జేరిన నా మనంబు గన జేరదు నన్యములన్ రఘూత్తమా!

ప్రచుర సుధాలవాల గుణ పాక రసౌచితి రీతు లొప్ప రా
మచరిత మానసంబును సమంచిత తావక కీర్తి యొప్ప స
ద్రచితము గాగ నా తులసి దానొనరించి తరించె భక్తితో;
సుచరిత! దాసునిన్ కరుణ జూడుము కొల్చెద నిన్ రఘూత్త

పాయని భక్తి సాంద్రమున భాస్కర; గోపక; రంగనాధ; రా
మాయణ కర్తలున్; విబుధ మానిత మొల్లయు; కూచి మంచి; బ్రా
హ్మయుత విశ్వనాధులు; మహిన్ దగ నెందరో మిమ్ము గొల్చి యా
త్మీయులు నైరి మీకు; గను మింతగ నన్ కృపతో రఘూత్తమా! ౩౭

మీ కమనీయ మౌ కృపలు మీరిన చల్లని చూపు గల్గ నా
ఝూకుగ దేలె సంద్రమున జోద్యముగా గిరు లెల్ల బెండులై;
యేకముగా కపుల్ రిపుల నేపడగించిరి మీ దయోన్నతిన్;
నాకౌనగూర్పుమయ్య! కరుణామృతదృక్కుల శ్రీరఘూత్తమా! ౩౮

మండిత భాస్కరాన్వయుడు; మార మనోజ్ఞుడు; సార్వభౌముడా
ఖండల తుల్యవిక్రముడు; ఖండశశాంకధరామరాది స
న్మండల భక్తిసేవితుడు; మా రఘు రాముడు; ధార్మి కుండు దా
రుండని చేరితిన్ రవికులోత్తమ! మిమ్మిట! శ్రీరఘూత్తమా! ౩౯

సార మతిన్ వచో మధు రసాల రసాల సుధాఽలవాల మం
దార నవాఽమృతాల విబుధాధిపులౌ కవి సార్వభౌము లెం
తో రమణీయ శైలుల బుధోత్తము లౌనన సంస్తుతించి నిన్
జేరిరి, యల్పుడన్ఁ బలుక జేసినఁ బల్కెద నిన్ రఘూత్తమా! ౪౦

రంగ దభంగ తుంగ తత రమ్య తరంగ సుధా సరి త్కృపాఽ
పాంగ దృగబ్జ లాలిత ప్రపన్న జనైక హృదబ్జరంగ! స
త్సంగ ధరాత్మజా హృదయ తామరసామృతమత్త భృంగ! శ్రీ
రంగ! గుణానుషంగ! రుచిరాంగ! దయన్గనవే! రఘూత్తమా! ౪౧

శ్రీశుభద ప్రదీ! సుజన సేవిత మోహన రూప వార్నిధీ!
ధీ శమదాద్యనంత గుణ దివ్య పయోదధి! సత్సుధానిధీ!
దాశరధీ! దయాశరధి! ధర్మవిధీ! విలసద్యశోదధీ!
నే శరణంచు వేడితిని నీవిధి, నేలుము నన్ రఘూత్తమా! ౪౨

—: o :—

శ్రీః

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# క్షేత్ర సందర్శనము

శ్రీ జనకాఒత్మజా మృదు శు
చిస్మిత పూర్ణ ముఖాబ్జ భృంగమా!
రాజ నరేంద్ర మౌళి మణి
రంజిత పాద సరోజ పీఠమా!
రాజిత కీర్తి వైభవ ప
రంపర భాసిత దిగ్విశాలమా!
ఓజయరామ! మీపదము
లూనితి నన్ గనుమా! రఘూత్తమా!

కంటిని చారు విస్మయ సుఖాస్పద శీతల శీకరాతి ని
ష్కంటక రంగ దుచ్ఛల విశాల వియ త్పరి జృంభమాణ సో
త్కంట బృహ త్తరంగ పరిఘట్టన కూల చల ద్విలోల శ్రీ
లంటిన మందయాన శుభలక్షణ పీటిని గౌతమీతతిన్;

కంటిని చూడ ముచ్చటగు కల్మిని బెంచెడు క్రొత్త వెల్గుఁజే
నంటి ప్రజాళి కిచ్చుటకు నర్మిలి నిచ్చటె భాగ్యలక్ష్మి సొం
పంటి సముద్రమై మిగుల బర్వెనదో యన మేల్మి నొప్పి సొ
రంటిన యీ వినూత్న రుచిరంబగు[1] శ్రీమయ రామ వార్నిధిన్

---

1. పోచమ పాట్ మహాదధిన్.

కంటిని; నూత్న వైభవము గల్గిన పోచమ పాట్పురమ్ము సౌ
రంటిన సౌధ జాలముల రమ్య విశాలములైన వీథులన్;
పంటల లచ్చి సోయగము పర్వెడు క్షేత్ర మనోజ్ఞలక్ష్ములన్
గంటికి సంబరమ్ము లిడు కల్మల రాసుల యింపు పెంపులన్; ३

గంటిని; న్యాయ సత్పథము గాంచిన సత్య శివైక సుందర
మ్మంటిన శేముషీ విభవ మాన్యుల; విజ్ఞుల శాంతి సౌఖ్య మే
పంటిన భక్తి తాత్వికుల భద్ర మనోహరులైన ధర్మ దీ
ప్తంటిన సాధు సద్గుణ విదాం వరులైన విశిష్ట శిష్టులన్ ४

గంటిని; గౌతమీ విమల గాంగిక తుంగ తరంగ శీకరా
లంటి చెలంగు తీరమున లక్షణ శాస్త్ర విధాన మొప్పు చె
ల్వంటిన గోపురాది విభవమ్ముల వెల్గుచు నిత్య నూత్నమై
కంటికి జూడ ముచ్చటలు గల్గెడు మందిర సుందరమ్ములన్ ౫

గంటిని, ఘోరమైన భవ కాల భుజంగ విష ప్రకోపమున్
కుంటొనరించి భక్త జన కోటులనే తరియింప నెంచు జే
గంటల సవ్వడుల్ సెలఁగు గారుడ దివ్య పతాక దీప్తుల
న్నింటన వెల్గు స్తంభమును, నిర్మలమౌ బలిపీఠ రమ్యమున్ ౬

గంటిని; సాగిలం బడితి, కాంత నితాంత వినిర్మితంబులౌ
మంటప మండితంబులగు మందిర గర్భ సుశోభలన్ని గ
న్గొంటిని, దేవళంబునకు కోరిక మీర ప్రదక్షిణ త్రయం
బంటి యొనర్చి సత్ప్రకృతి భాసుర ముగ్ధ కళా స్మితంబులన్ ౭

గంటిని, నిత్య నూతన సుఖప్రద నీల ఘనాఘనంపు శ్రీ
లంటిన శ్యామ సుందర విలాస తనూజ్జ్వలు నార్తలోక దు
ష్కంటక హారు, ధీర గుణ శౌర్య జితాఽసుర జాలు, శీలు, ము
క్కంటి శరాసనార్భట విఖండన శీలు, దయా విశాలు, చె ౮

న్నంటిన సుస్మితేందు ముఖ నవ్య కళోర్ధ్వ మయూఖ పుండ్రుడు, శీ
వంటి వెలుంగు బాహుబల వర్ధిత కార్ముక బాణ జాలు, సొం
పంటిన కన్ను దమ్ముల నపార కృపాంబుధు లూర జేసి త
న్నంటి చరించు భక్తులను నర్మిలి బ్రోచెడి రామభూవరున్ ౯

గంటిని నీవె యంచు, సిరిగల్గెడు సత్కరుణాఽమృతాల వె
న్వెంటనె చిల్కు దాసతతి నేలెడు మా జనకాత్మజాసతిం
గంటిని, శిష్ట లోక జన గణ్యుని లక్ష్మణ సూరి వర్యుఁ గ
న్గొంటిని; సాధు భృత్య జన కోటి సమర్చితు నంజనీ సుతున్ ౧౦

గంటిని, యాత్మ తృప్తి గలుగంగ భవత్కమనీయ సద్యశ
స్సంటి దిశాంతరాళముల సాగుచు నున్న కథాఽమృతాల నే
తంటలు లేని నిష్కలుష ధార్మిక విశ్వ శుభ ప్రదంబులై
మంటిన మింట నేకమయి మాన్యత లొప్పు భవద్గుణాల నె ౧౧

న్నింటినొ మీ పదాబ్జ రత నిశ్చలులౌ విబుధాళి చెప్పగా
వింటిని కర్ణపేయముగ; వేడుచు నిన్ మనసార మ్రొక్కి నా
కంటిన పాపసంతతులు కాలుచు గూలిన తీరు నాత్మలో
గంటిని దుఃఖ మూలమగు కర్మ పరంపర లెల్ల ద్రెళ్ళి న ౧౨

ట్లుంటిని; విష్ణుచిత్తు; శఠలుంతు, జగద్గురు భాష్యకారులన్,
గంటిని; శ్రీసతిన్ భవ దఖండ యశంబును భక్తి తత్వ మే
పంటగ గోపకాంతయయి వర్ధిలి ముప్పది యైన పాటలన్;
జుంటుల తేనెలూర విన సొంపుగ బాడిన రంగనాయకిన్, ౧౩

గంటిని, సాగిలం బడితి కల్మష మూడ నుతించి తృప్తిచే
కొంటిని; మీపదాల సిరి గొల్చెడు భక్తులఁ గండ్ల సంబరం
బంటగ జేసికొంటి; నిట భాగవతోత్తమ దేశికాళి నే
గంటిని; దాస్య భావ మెదఁ గల్గగ ప్రాంజలి నైతి పుట్టువిం ౧౪

కంటిల గల్గదంచు మది గాంచితి; జన్మ తరించె నంటి; నా
కంటిన కర్మ బంధముల గల్గిన దుష్కలి గూల్చి వేయ ర
మ్మంటిని, యోప్రభూ! యనుచు మాటికి యార్తిన పిల్చి చేదుకొ
మ్మంటిని; యీషణత్రయము మార్కొన జేసెడి షడ్రిపుల్ సదా ౧౬

వెంటఁ జరించి నామదికి వేదన గూర్పగ; నిల్వ నోప లే
నంటిని; దోష దూష్య భవ నారక దుస్పృహ ఘోరవార్ధి ము
న్గుంటిని, దుర్వికార మగు కోర్కెల కోటుల యందు స్వార్ధమే
యంటి కొనుండఁ జిక్కి యమ యాతన లొందుచు దిక్కులేక నీ

పొంటి చరింప నెంచి కడు పొక్కుచు స్రుక్కుచు కంటినిండనీ
రంటగ నేడ్చి యేడ్చి యిల రక్షకు లెవ్వరు లేరు లేరు నా
కంటు, యెలుంగు రాల్పడ దగన్ మొర బెట్టి త్వదంఘ్రిసేవ ని
మ్మంటిని, ధూర్త దుష్కుటిల మాయిక వంచక ఛద్మలోక మ ౧౭

న్నింటఁ జెలామణౌచు కడు నిల్చిన యీ కలికాలమందు నే
నొంటిగ నోర్చి యుండి మన నోపని దీనుడ; మీపదాల సొ
త్తంటి చరించు దాస జన దాసుల దాసుల దాస దాసుడన్
కంటక లోక బాహు బల గర్వ మదోత్కట పాశ బద్ధుడన్ ౧౮

కంటిన నీరు గల్ల దొకొ? కాంచగ నన్నిట నీకు స్వామి! యే
మంటు వచింతు దుర్విధులు మానక నన్ గడు లొంగదీసె, చూ
పంటు నొసంగ లేవొ? వెతవందిన నా బ్రతు కెల్ల జూచి నీ
కంటిక నైన నాపయిన గల్గదె జాలి రవంత నైన, దు- ౧౯

ష్కంటక హార! నీ హృదయ సారస మింత ద్రవింపలేదొ? నా
కంటిన పాప మేమి? నిను గాదని నేనొరు నాత్మ నెంచ లే
కుంటిని, సర్వమున్ విడిచి కోరితి నిన్ మనసార జేరి నా
నంటిని, బ్రోవు మంటి శరణంటిని[1] నన్గనవే రఘూత్తమా! ౨౦

—: o :—

1. పోచమపాట్ రఘూత్తమా.

శ్రీః

శ్రీ సీతారామాభ్యాం నమః

# క్షేత్రావతరణము

శ్రీరఘురామ! దివ్య దత
  సీ సుమ కోమల నీల నీరదా౽
కార మనోజ్ఞ సీమ! సిత
  కంజ దళా౽యత లోచనాంత శ్రం
గార గుణా౽భిరామ! కలి
  కల్మష నాశక రామనామ! ఓ
తారకరామ! నీచరణ
  దాసుడ![1] బ్రోచుమపాట్ రఘూత్తమా!

ఇన కుల రత్న దీప! కరుణింప దలంచుచు మమ్ము పేర్మితో
జనకజఁ గూడి మీ రిచట సత్పరివారముతోడ నిల్వగన్
కనగ నయోధ్యగా నమర గల్గె పురం బిది నిక్కమయ్య! మా
యనఘపు పూర్వ పుణ్య కృత యత్న ఫలంబిదెరా! రఘూత్తమా!

మీ పద పద్మ సంపదలు మీరుచు నిచ్చట నిల్చి నంత దు
ష్కోప చరైక ముష్కరుల కోటి యడంగగ నీప్రదేశముల్
రూపరి వోవ ఘోరకలి, రూఢిఁ బవిత్రతఁ గాంచగల్గె మా
పాపము లూడె నిక్క మిది, పార్థివనాయక! శ్రీరఘూత్తమా!

---

1. బ్రోవవె నన్ రఘూత్తమా!

ఎంతటి పుణ్య మేచికొన నెంతగఁ జేసెనొ! యీ ప్రదేశ మిం
తింతన రాని వైభవము దాల్మిన బొందెను మీ కతాన; ర
వ్వంతయు మీ కృపా సరళి పర్వుటచే నిట ప్రాణికోట్లు మీ
స్వాంతము బొంద గల్గినవి, సత్యమె యౌ గదరా! రఘూత్తమా! ౩

మీ కరుణాఽమృతంబు లిట మీరుచు గౌతమి గాగ మారె, మీ
శ్రీ కమనీయ దృగ్వితతిఁ జిందు సుధల్ జలరాశి యయ్యె; మీ
రాకన యీ పురంబు గన రమ్య వికుంఠముగాగ నొప్పె మో
దాకరమయ్యె మా బ్రతుకు ధన్యతఁ గాంచె గదా! రఘూత్తమా! ౪

పరమ దయాకరుండవయి భద్రత లివ్వ దలంప బూని కిం
కరులము నైన మమ్ములను గావఁగ నిచ్చట ఁగల్గినావె; మీ
కరుణ లమోఘ మయ్యె! పలుకంగనరావు గదయ్య! స్వామి! మీ
చరణము సోకి మీ ధరణి సార్ధక మయ్యెగదా! రఘూత్తమా! ౫

ముద మలరంగ బల్ వెదకవోయిన తీగయె ప్రీతిఁ గాళ్ళకే
యెదుగుచు ఁజుట్టి నట్లు, విజయేశ్వర! మీ కమనీయ సత్కృపా
సుధ లిట బర్వి పూర్ణమయి శోభిలె దివ్య సరోవరంబుగా;
కొదువలె మాకు! మీదయలు గూడగ! కావగ; శ్రీరఘూత్తమా! ౬

ఎంతటి పుణ్య మీధరణి యెంత నొనర్చెనొ? గాంచరాదు, శ్రీ
కాంత! భవ త్పదాబ్జముల కల్మిని బొంది తరించె; చూడ నెం
తెంతనొ ప్రాణి కోటు లిట దివ్యములౌ భవ దంఘ్రులన్ సదా
స్వాంతము నందు నిల్పి నతి సల్పి తరించెను; శ్రీరఘూత్తమా! ౭

కుటిలులు పాప చింతనులు క్రూరులు స్వార్ధ పిశాచ లోకముల్
పటుతర నాస్తికాధములు భ్రష్టులు నింద భరింపలేనిదై
తట మట మంది బాధపడు ధారుణిఁ దాల్మిన నేల నెంచి నీ
విట కరుదెంచినావొ? కడు వింతర మీదయ, శ్రీరఘూత్తమా! ౮

ఘటిత సువర్ణ చేల! కలగా పులగంబయి ఘోరమైన సం
కటములలోన జిక్కి కడు గాసిలి కుందెడు సాధు భక్త స
త్పటలము నేల నెంచి గుణ భద్రుడవై విలసిల్లినావొ? మా
కిట భయ మెవ్వ రెందు గలిగింపరు నిక్కమురా! రఘూత్తమా! ౯

కోరిన సాధు భక్త జన కోటుల కోర్కెల దీర్ప కొంగుబం
గారము గాగ వెల్గి యిట కల్మష మూడ్చి తరింపఁ జేయు కా
సారపు తీరమందు వనజాక్షిని జానకి గూడి యుండ; మా
పేరిమియెల్ల పండె, భవ భీతి తొలంగెనురా! రఘూత్తమా! ౧౦

ఘోర భవాంధకారముల గూడి మదించిన శత్రుషట్కమం
దారని స్వార్థ చింతనల దాగి కుతంత్రపు నాస్తికాళి దో
స్సారములందు జిక్కి యెటు సాగని పాపపు పంకిలాన, యే
దారులు లేని జీవులకు దారిడ వచ్చితివా? రఘూత్తమా! ౧౧

కాలము చూడ దుష్ట కలికాల మిదౌను, పథంబుజూడదు
ర్భీల వికారకాపథము, పేర్మలు జూడ కుతంత్ర కుత్సితో
ద్వేలము, పాలనమ్మనిన విజ్ఞతహీనమె యంచునెంచి, భ
క్తాళిని గావనెంచి యిట గల్గితివా? దయతో రఘూత్తమా! ౧౨

ఖల మత దుర్విదగ్ధులిట కాళ్ళకు గజ్జెలు గట్టి యాడ, దో
షుల తగుతీరు కోర్కెలిల సూటిగ సత్ఫలితంబులొంద; వే
ళలు; కలికాలముల్ కుపదులందరికిన్ దగు తీరు నొప్ప; భ
క్తుల బ్రతుకూడెనంచు కడుకుందుచు నిల్చితివా? రఘూత్తమా! ౧౩

[illegible]ాని నూతగొని కానని వాడటు లేగినట్లు ని
[illegible] ంకలి కూపెడు కానరాని లో
[illegible] సత్పథమూన లేక; నీ
[illegible] ్చితివా? రఘూత్తమా! ౧౪

పూజ్యత గల్గి ధర్మ పరి పూతములై వెలుగొందు నట్టి మీ
రాజ్యపు సత్స్వతంత్రములు; నైతిక సత్పథ సత్య వర్తనల్;
పూజ్యములౌచు కృంగి పడిపోవ; నఘంబులు పెంపు కాంచ, యే
భోజ్యము లేక నీ జనము పొక్కగ జేరితివా? రఘూత్తమా ౧౫

కలుష చరైక ముష్కరులు కాటకులౌ ఖల పశ్యతోహరుల్
తలపడి మానవాకృతుల దాల్చిన భూతపిశాచరాక్షసుల్
పలు విధులందు సాధులకు వంతల గూర్ప సహింపలేక వా
రలఁ దెగ గూల్ప నెంచి యిట రంజిలుచుంటివ? శ్రీరఘూత్తమా? ౧౬

భారత భావి భాగ్యముల వర్ధిలఁ జేయు మనోజ్ఞ జీవులన్;
పౌరుష హీను లట్లు కులపాంసనులై కలి భీతి మాని, వం
ధ్యారత బుద్ధులై నరులు తల్లుల గర్భములందె కూల్ప ని
ద్ధారుణి దద్దరిల్ల నిట దాపయి నిల్చితివా? రఘూత్తమా! ౧౭

నిర్మల మైన సత్పథము నిల్పిన ధార్మిక సత్య శౌచ స
త్కర్మలు వెల్గు నీ భువిని ధర్మ విహీనుల పాలనాన దు
ష్కర్మల తోడ జాతి కుల సద్విధులందున సంకరంబులన్
దుర్మతు లూన; వారి నిట దూడ్చగ వచ్చితివా? రఘూత్తమా! ౧౮

చెప్పగరాని దుర్విధులఁ జేయగఁ రానివి యైన చేతలన్;
తప్పుల నొప్పులన్ దెలియు ధర్మ పరుల్ వెను స్వార్థ చిత్తులై
ఇప్పుడమిన్ స్వతంత్ర విభవేందిరకౌ సుపథాన సద్విధిన్
చొప్పుణగింప; నోర్వ కరిసూదన! చేరితివా? రఘూత్తమా! ౧౯

శ్రీనిధి! కానిచో నటుల; చెల్లెడి మీ కలికాల మందు కం
పౌ నవ వర్తమానమున; పాపము నెక్కొనె డీతరాన, దు
ష్కానన పూర్ణమై వెగటు గల్గిన నీ భువిలోన; నిచ్చటన్;
జానకి తోడ మీ రిటకు సాగుట లెందులకో? రఘూత్తమా! ౨౦

మీ రిట నిల్వ గౌతమియు మేలగు నా [1]సురగంగ యయ్యె దు
ర్ఘోర వికారమౌ నడవి కోమల సుందర వన్యసీమయై
మీరెను; మందిర మ్మిదియు మెచ్చగ దివ్య వికుంఠ ధామమై
మారెను, ప్రాణికిన్ సుకృత మార్గము గల్గెనురా! రఘూత్తమా! ౨౧

నీ పద ధూళి సోకగనె నిల్చిన రాతియె నాతి యయ్యె, నా
చాప బలంబు మీ కరపు సత్తువ సోకగ బెండు వయ్యె, దు
ష్కోపుడు భార్గవుండు నిను జూడగ శాంతుడు నయ్యె నీదు మే
ల్పాపున నిద్ధరాతలము పావన మయ్యెనురా! రఘూత్తమా! ౨౨

ఒక్కొక చోటి కొక్కొక మహోన్నత మైన విశేష వైభవం
బొక్కొక కాలమం దొనర బూనిన తీరున నీ స్థళంబు పెం
పెక్కెను మీ కృపాసరళి వెల్లువయై ప్రవహింప; మాకిలన్
దక్కెను మీ పదాబ్జముల దర్శన భాగ్యము, శ్రీ రఘూత్తమా! ౨౩

శ్రీ సరసీరుహాక్షి కడు చెల్వగు భూసుతగాగ; శేషుడే
వాసిగ లక్ష్మణుండుగను; భవ్య సుదర్శన పాంచజన్యముల్
ధీ సుగుణాత్ములౌ భరత ధీర రిపుఘ్నులు గాన్ వికుంఠ సం
వాసుడె మీస్వరూపమున వర్ధిలె నిచ్చటెరా! రఘూత్తమా! ౨౪

మాయులు గాని భక్తులును; మాన్యులు శేష మనోహరాది భ
క్త్యాయత మూర్తు లిందు భవ దాలయ మేర్పడఁ జేయ పేర్మితో
ధ్యేయమె మీ పయిన్ నిలిపి దివ్య తపస్సులు దారవోయ నా
రాయణ జియ్యరుల్ తమను రక్తిన నిల్పిరి శ్రీరఘూత్తమా! ౨౫

భక్తులు నెంద ఱెందఱొ సభాజనమౌ తగు సేవలందు నా
సక్తులు నౌచు మీకు కడు చక్కని మేలిమి వస్తు వాహనాల్
భక్తిన నిచ్చి సుస్థితిని బర్వెడు కీర్తి ధనాఢ్యులౌచు స
న్ముక్తిని పొందుచుండిరి యనూన భవత్కృపతో, రఘూత్తమా ౨౬

---

1 విరజాపగయ్యె.

భవ్య తపఃప్రభావులగు భక్తుల నేలు పవిత్ర కాశికా
దివ్య గయా ప్రయాగలను దివ్యదయోధ్య పురాదిసీమలన్;
సవ్యత లింత లేక గనజాలని రిక్తుల శక్తి హీనులన్;
అవ్యయమూర్తి! ఆదుకొన నర్మిలి నిల్చితివా? రఘూత్తమా!

శ్రీ రమణీయ భూషణ! సుశీల జనావన చారు సద్గుణా!
కారణ కాల కారణ! వికార చల త్కలి దర్ప హారణా!
దారుణ దుష్ట రాక్షస మదాంధ వినాశక చాప బాణ! నా
నా రమణీయ కీర్తి ధిషణా! కరుణాచణ! శ్రీరఘూత్తమా!

—:o:—

శ్రీః

శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీవారికి – మేలుకొలుపు

శ్రీ కిరవైన నేల సిరి
చేడియ కూతురి నీటుకాడు, నా
జూకగు కండ్లసోయగపు
చోద్యము గొల్వగ రానివాడు; ల
క్ష్మి కమనీయ కౌస్తుభపు
చెల్వము గల్గెడురమ్మువాఁడు; ఇల్
సోకులవాడు; భానుకుల
సోముడు; నీవెర! శ్రీ రఘూత్తమా!

శ్రీమతి కోసలాత్మజకుఁ జెల్వము గూర్చెడు పుత్రరత్నమా!
రామ! గుణాఽభిరామ! ముని రాజ నుతోన్నత నీల నీరద
శ్యామ! ప్రభాత మయ్యె తొలి సందెల సద్విధి దీర్ప లేవరా!
స్వామి! నృసింహ! మేలుకొనవయ్య ప్రభూ దయతో రఘూత్తమా! 1

చెలువము చిందు లాడు నును సిగ్గుల బుగ్గల సుస్మితంబులే
తళతళలాడ ప్రాక్సుదతి తాల్మిన మేల్కొనె నోఖగధ్వజా!
తలిరుల సౌరు మంచు గమి తళ్కుల మీరె ముకుంద! లేవరా!
కలుముల రాణి పేర్మి చెలికాడ! సుమప్రులు బాల్ రఘూత్తమా! 2

కూరిమి గుల్కు మా పుడమి కూతురి కన్నుల కల్వఱేడు సిం
గారపు తెల్లతమ్మి జిగి గ్రాలెడు కన్గవలందు పేర్మి పెం
పూరుచు నున్న వాఁడు, మురువొందని జోగుల మేటి డెందముల్
జారగ జేయు వాడు, మనసౌనన నీవెర! శ్రీరఘూత్తమా. 3

చెంపకు చేరెడేసి గల చెల్వపు కన్గవ దమ్మివాడు; మే
ల్సొంపుల నింప పెంపయిన చూడ పసందగు వన్నెకాడు, బీ
రంపుల వింటికాడు, మగరాయల రాయడు నేల పట్టి డెం
దంపు పసందుకాడు; జనదైవము నీవెర! శ్రీరఘూత్తమా! ౨

చెందొవ కన్నె సౌరులు కృశించెను, చక్కని చందమామకా
నందము లెల్ల సన్నగిలె, నవ్వల రువ్వెడు తారకాంగనల్
చిందర వందరై చనిరి, చెల్లదురా! యిక నిద్ర నీకు గో
విందుడ! లేర! శ్రీల నిడి విశ్వము నేలర! శ్రీరఘూత్తమా! ౩

తల్లి! మనోజ్ఞ వల్లి! విబుధాశ్రిత సజ్జన కల్పవల్లి! శ్రీ
వల్లభుడైన రాఘవుని వర్ధిలు దివ్య దురస్థలాన సొం
పిల్ల సుఖైక సుప్తి గని వెళ్గెడు సీతమ తల్లి! లెమ్మ, రే
లెల్లను విచ్చె నంచు; దగ లేపితి నీ సతి నోరఘూత్తమా! ౪

ఇమ్మహి భక్త సంతతికి నెల్లపుడున్ భవ దగ్ర జాంఘ్రములన్
సమ్మతిఁ జేర్చు సద్గుణుడ! స్వామి! జగన్నుత రామ సోదరా!
లెమ్మిక ప్రాక్సతీ స్మితము లెల్ల వెలింగెను, చూడు మంచు, నీ
తమ్ముని లేపినా నిపుడె తాల్మిన లేవర! శ్రీరఘూత్తమా! ౫

పాపముఁ ఖెంపు సేయు నరపాంసన జాతిని గూల్చివేసి నీ
ప్రాపును జూపు నామమును పాడుచు నీ పద పద్మ సీమలే
దాపని నమ్మి ప్రాంజలిడు తావక భక్తుని మారుతాత్మజున్
లేపితి నిప్పుడే నిదుర లెమ్ము నరోత్తమ! శ్రీరఘూత్తమా! ౬

అల నలకూబరున్ గలిసి యద్భుత చారు విలాస నృత్యమున్
చెలిమి నొనర్చు రంభ పద శింజిక చిట్టట దొర్లెనోయనన్,
చెలగెను వేగు చుక్క కడు చెల్వము మీరగ తూర్పు దిక్కునన్
వెలిగె ప్రభాత రోచు లిట వేగమె మేల్కొనరా! రఘూత్తమా! ౭

చల్లని పిల్ల గాలి దొర; సారస రమ్య సరోవరాలు రం
జిల్ల పటీర సౌరభము జిల్కుచు దక్షిణ దిక్కు నుండి బా
సిల్లుచు వాహినీ విమల శీకర తుంగ తరంగ డోలికో
త్ఫుల్ల మనస్కుడై వెడలె దూలుచు; మేల్కొను శ్రీరఘూత్తమా ౮

ఓ యిన వంశ సోమ! గనవో! అరుణారుణ రేఖ లిప్పుడే
పాయక హెచ్చి తూర్పు సతి పైట చెఱంగయి మీరుచుండె; లే
వోయి! యనంత భోగి వర భోగ విశేష వినోద తల్పమున్
పాయుమురా! శుభోదయము పర్వెను; మేల్కొను శ్రీరఘూత్తమా! ౯

శుక కుల మాధురీ మృదుల శుభ్ర వచస్సులు వింత గొల్పెరా!
పిక కల సత్సుధారవము వీనుల విందులు సేసె నయ్యా! తా
రకలు దొలంగె; రేయుడిగె; రంజిలె జక్కవ లెల్ల; పద్మముల్
వికసితమయ్యె; కల్వ సిరి వీడెను; మేల్కొను మోరఘూత్తమా! ౧౦

శాంత మనో వికాసముల సాగెడు సత్ప్రకృతీందిరా స్మితం
బంత జగ ద్వికాసమయి; భవ్య మనోహరమై వెలింగె, నా
శాంతములందు చల్లని ప్రశాంతత గూర్చెడు లేత తెమ్మెరల్
సంతస మివ్వ సాగినవి చక్కగ, మేల్కొనరా! రఘూత్తమా! ౧౧

మల్లెలు; మొల్లలున్; పొగడ; మాలతి; జాజులు; పొన్న; సంపెఁగల్,
కొల్లలు గాగ విచ్చుకొని కోమల సౌరభ సంహతిన్, భవ
త్ఫుల్ల సరోజ పాదములఁ బొందఁగఁ జేయఁగ బిల్ల గాలితో
మెల్లఁగఁ బంపు చుండినవి, మేల్కొను వేగమె, శ్రీరఘూత్తమా! ౧౨

రంగుగ పుష్ప సంపదల రంగ దభంగ విలాస విస్తృతితో
త్తుంగ తరంగ హస్తముల దోయిలి నూనుచు గౌతమీసదీ
మంగళదేవి, మీ విమల మంజుల పాద సరోజ సేవకై
ముంగిట వేచె నయ్యా! కృప బూనవె! మేల్కొనవే! రఘూత్తమా! ౧౩

భారత దివ్య సంపదల భవ్య మనోజ్ఞ విలాస సంస్కృతీ
సారములన్; పవిత్ర మగు సత్పురుషాళి యశో విశేషమున్;
కారణ మెవ్వడీ జగతి కారయ నాతని దివ్య దీప్తి శృం
గారము లన్ని మోసికొని గౌతమి వేచెను; లే రఘూత్తమా! ౧౪

వింతగు మంచు ముత్యముల వేడ్కగ కాన్కగఁ జేసి పూని సా
మంతుల తీరు పాదప సమాజము పంక్తులు దీర్చి నిల్వగా
సంతస మొందు మల్లియల చామరముల్ గొని వీవ పిల్లగా
లంత దినేశు డొప్పెను విలక్షణుడై గనవే! రఘూత్తమా! ౧౫

తోరము మీర తారకల "దొల్గుడు మీరిక నావిభుండు వే
సారెను నిల్చి సాగు"నని చయ్యన వేడ్కన నంపి మిత్రసం
చారము గాగ నా గగనసాధ్వి యొనర్చిన రాచబాటలన్;
నేరుపుతోడ భాస్కరుడు నింగిన సాగెను; లే రఘూత్తమా! ౧౬

సతతము సత్కవుల్ బుధులు సాగెడు సాధు పథాంతరమ్ములన్
చతురత మీర శ్రీశుకులుః సద్విజులైన భరద్వాజాదులున్;
స్తుతమతులై మనోజ్ఞ శుభ సూక్తులు పల్కుచు ముందుసాగ; ప్రా
గ్వితత వియత్పథాన కడు వెల్గె నినుండదో! లే! రఘూత్తమా! ౧౭

లలిత శుభోదయంబుల విలక్షణ యౌచు నుషాకుమారి స
త్కళల చిగిర్చు స్మేరముల తళ్కులు జాల్కొన మోము దమ్మిపై
కులసతి యౌచు కుంకుమను కూర్మిన దిద్దినదో! యనంగ; కాం
తుల వెదజల్లి బాల రవి తోచెను తూర్పున; శ్రీరఘూత్తమా! ౧౮

అఘముల ఘస్మరించు విమలాద్భుత రమ్య రుచిప్రపూర్ణుడై
మఘవుడు నాది గాగల నమర్త్యులు సంస్తుతిఁ జేయుచుండ నీ
రఘుకుల హేతు భూతుడగు రత్నమయూఖుడు భాస్కరుండు నో
రఘువర! తూర్పు కొండపయి రాజిలె;మేల్కొనరా;రఘూత్తమా! ౧౯

దారు తరైక ముగ్ధ విలస త్సుకుమార విలాస పూర్ణ ప్రా
చీ రమణీ మణీ మృదు శుచి స్మిత దంత సుఘట్ట నోరు వీ
టీ రస రమ్య రాగ సుపటిష్ట నవాధర బింబ మట్లదో
వారిజ బాంధవుఁ డెదగె, ప్రాగ్దిశ, మేల్కొను శ్రీరఘూత్తమా! ౨౦

గొల్లల పల్లెలందు కడు కోర్కెలు మీరగ గొల్ల భామినుల్
చల్లలు సేయగాఁ గలుగు చక్కని కవ్వపు మేల్మి సవ్వడుల్;
ఉల్లస మొప్పగా వృషభముల్ కడుఁ జేసెడి అంకె లిమ్మహిన్
ద్రెళ్ళగఁ జేసె దుష్కలిని తీవ్రిలి; మేల్కొనరా! రఘూత్తమా! ౨౧

విరిసిన తమ్మిబోంట్ల నును వెచ్చని చెక్కిలి నొక్కి చొక్కమౌ
మురువగు తేనెలూరు నును మోవిని తేటులు ముద్దువెట్టుచున్
పరువము చింద మైకమున బారుచు పాటలు పాడుచుండె, నో
సరసిజనాభ! నిద్దు రిక చాలుర! మేల్కొనవే రఘూత్తమా! ౨౨

ఏడగు వార్వముల్ సెలగు నింపగు బంగరు తేరుపైన బల్
కోడెతనంపు సౌరు లొనగూడ పసందగు తమ్మిగద్దెపై
వాడని పౌరుషంపు జిగి పర్వ జగామొనగాడు తమ్మివూ
రేడు; వెలింగి సాగె తగు రీతి జగమ్మున; శ్రీరఘూత్తమా! ౨౩

సప్త ఋషీశ్వరాది దివిజాధిప దిక్పతు లెల్ల రర్మిలిన్
తృప్తిన దివ్య వాహినుల తీర్థములాడి మనఃప్రశాంత సం
దీప్తులు నౌచు ప్రాంజలిడి దివ్యసుమంబుల గొల్వ వేచిరో
దృప్త నృశంస నాశక! సుధీమణి! మేల్కొనరా! రఘూత్తమా! ౨౪

రక్తిన లేచి వేకువనె రాజిలు పున్నెపు[1] దివ్యవాహినిన్
భక్తులు క్రుంకు లొంది భవ బాధ లడంగగ నిర్మలాత్ములై
భక్తిన నవ్య పుష్పముల ప్రాంజలులై మిము గొల్వ వేచిరో
మౌక్తిక ముగ్ధహాస! నవ మన్మథ మన్మథ! లే రఘూత్తమా! ౨౫

---

1. గౌతమీతటిన్.

వర సుర మౌని తుంబురులు పాటల వీణెల మీటి పాడుచున్
సుర వనితాళి నృత్యముల సొంపులు గుల్కగ పేర్మినాడుచున్
పరమ పవిత్ర భావములఁ బ్రస్తుతి జేయుచు మీదయార్థులై
పరుగున వచ్చి వేచి రిట; పార్థివ! మేల్కొనరా! రఘూత్తమా! ౨౬

సిగయును; జన్నిదంబు, కడు జెల్వము జూపెడు నూర్ధ్వ పుండ్రముల్
తగ సరిగంచు ధోతు లటుతజ్ఞ సొగసౌ నళినాక్షమాలలున్
సొగసులు చింద వైష్ణవులు సూరులు సద్విజ ముఖ్యులెల్లరున్
నిగమ విశాల! నిన్గొలువ నిల్చిరి; మేల్కొనవే! రఘూత్తమా! ౨౭

వినతసుతుండు; వాయుజుడు; నేత్ర ధరల్; భుజగాధి నాధులున్
వినుతు లొనర్చి సద్విధుల వేడ్క నొనర్పగ వేచినారు; మీ
వనజ పదంబులన్ గొలువ భక్తులు తావక దాస దాస స
జ్జన పద దాస దాసు లిట సాగిలి వేచిరిరా! రఘూత్తమా! ౨౮

తూరిమి బూజ సేయుటకు గోర్కెన పూవులు దెచ్చినాను, రా
రా! రవి వంశ రాయ! కృప రంజిల జిల్కుము దీనుడైన నీ
నీరజ పాద సేవకుఁడు నిల్చెను వాకిట దర్శనార్థియై
నీరమణీయ దర్శనము లివ్వవె! మేల్కొనవే! రఘూత్తమా! ౨౯

వర ఝష రూప! కూర్మ! కిటి! భద్రనృసింహా! ఉపేంద్ర! భార్గవా!
నిరుపమ రామనామ! రిపు నిర్దళనాఽతి బలాఽభిరామ! భా
సుర యదు వంశ సోమ! అఘ సూదన వీర ప్రచండ కల్కి! ఓ
పరమ పదైక వాస! గన వచ్చితి మేల్కొనరా! రఘూత్తమా! ౩౦

ఈ లలితంపు మేలు కొలు పింపున నెవ్వరు సుప్రభాత మౌ
వేళల భక్తి తత్పరత వెల్గగ నెప్పుడు పాడుచుందురో;
లీలగ వారికౌ సిరులు లేశము పాపము గూడ దెందు, నీ
పాలన మొప్పి సద్గతుల నర్వుదు రిమ్మహి శ్రీరఘూత్తమా! ౩౧

శ్రీః

శ్రీ హయగ్రీవాయ నమః

సరస్వత్యై నమః

# విజ్ఞాపనము

శ్రీ మిథిలాత్మజా హృదయ
శీతల సారస భృంగరాజ! దు
ష్కామ చరైక దైత్య రిపు
సంఘ విమర్దన శౌర్య తేజ! ది
వ్యామల భాను వంశ ఘన
వార్నిధి పూర్ణ మనోజ్ఞ రాజ! కీ
ర్త్యామిత రాజరాజ! నయ
ధార్మికతేజ! నమో! రఘూత్తమా!

నిను మది నమ్ము వాడవని నీల్గుట నాయెను, నమ్మ లేని వా
డనిశము శ్రీల దేలి ఘనుడై వెలు గొందుట నాయె, లోకమం
దనఘ! యిదేమి వింత? కన ధర్మ రతుం డడుగంటు టాయె, దు
ర్వినయు లధర్మచారు లిట పెంపయి రేమిటరా? రఘూత్తమా! ౧

ధార్మిక కర్మ భూమి పెడ దారుల బట్టెను, న్యాయ నీతి స
త్కర్మ రతాళు లెల్ల వివిధంబగు కాపథ మూనె, ధూర్తులౌ
దుర్మతు లెల్ల సాధు విబుధోత్తమ లోకము నొంచుచుండ్రు దు
ష్కర్మ లవిత్ర! నీ వెటుల సైచుచు నుంటివొ? శ్రీరఘూత్తమా! ౨

నీపయి బుద్ధి; నిన్ దలచు నిర్మల చిత్తము; నిన్ నుతించు తీ
రోపరు పూర్వ దుష్కృత పరుల్ పటు మూర్ఖులు నెంత జెప్పినన్
నీ పద దర్శనంబు గన నేనరరు, దు ర్విషయాను రక్తులై
కాపథ మందె సాగెదరు కాంతువె? వీరిని నో రఘూత్తమా! ౩

పాపపు కర్మ చింతనల బాల్పడి దుష్కలుషాఒను రక్తులై
యేపగు దుర్విధానముల నెన్నుచు, దోసములందు సాగుచున్
ప్రాపున నున్న సత్య నయ రమ్య పథంబుల రోసి యన్యదు
ష్కాపములందు మానవులు గూలుచునుండిరి శ్రీరఘూత్తమా! ౪

స్వచ్ఛత; ధర్మబుద్ధియు; భవత్పద చింతన; సాధు సేవ; ని
ష్పచ్ఛరమయ్యె, నీ యుగపు పాప ఫలంబున మానవాళికిన్;
హెచ్చెపు దుర్విధానముల బుద్ధులు హెచ్చెను; సద్విధానముల్
మచ్చుకు గానరావు భువి మానవ జాతిన; శ్రీరఘూత్తమా! ౫

మంచిని వంచు టయ్యె; కలి మాయల తీరుల బెంచుటయ్యె బ
ల్కొంచెపు బుద్ధులే యెదిగె; కుత్సిత వర్తన మెల్ల హెచ్చె; దీ
పించుచు స్వార్థ చింతనలు విర్విగ మూగెను; జ్ఞాన వర్తనం
బెంచిన వారిలోన నివి వింతగ మీరెనుగా! రఘూత్తమా! ౬

దూరపు కొండ నున్నులన దోచెడి తీరున నెండమావులన్
నీరని భ్రాంతి చెంది చన నేర్చెడి మందుల యట్లు నేడిలన్;
భారత జాతి ధార్మికపు భవ్య సుసభ్యతలన్ త్యజించి ని
స్సార మతిన్ పరాశ్రయ కుసంస్కృతి నూనెను; శ్రీరఘూత్తమా! ౭

విజ్ఞత లింత లేని చల వేత్తలు స్వార్థ పరాయణుల్ కృతం
త్రజ్ఞులు సద్విధానముల దారుల నింతగ జూడ లేని యీ
యజ్ఞులు నాధిపత్యముల యందు జరించి జగాన వెల్గగా
ప్రాజ్ఞులు నైన వా రడుగు వట్టిరి నేడిలలో; రఘూత్తమా! ౮

దొంగ దొరయ్యె; దుష్కపటి దొడ్డ దొరయ్యెను; రంకులాడి చూ
డంగ సుశీలయయ్యె; పలు డాబులమారియె భక్తుడయ్యె; పల్
రంగులు మార్చి మార్చి కడు రంజిలు జిత్తులమారి నక్కలే
యింగిత మివ్వనేర్చినవి యిమ్మహిం జూచితివా? రఘూత్తమా ౯

చదువులు రాని యజ్ఞులను చక్కని తెన్నుల నుంచ వచ్చు; బ
ల్చదువులు నున్న మూర్ఖులను సాధు పథంబుల నుంచలేము; దు
ర్విధులఁ జరించువారు బహువిజ్ఞుల మేమని చెప్పి లోకమున్
పదపడి దోచుచుండి రిల పార్థివ! చూచితివా? రఘూత్తమా ౧౦

నడతన మంచిలేని నవసాగరికుల్ పెర పంచ ద్రొక్కుచున్
తడబడి పోక; స్వార్థములు దన్నుకరాగ నమాయిక ప్రజన్
సుడివడ జేసి దుర్విధుల; జూచుచు నుండగ దోచుచుండి; యే
యొడు దొడుకేమి లేకిచటె యొప్పుచు నుండిరి; శ్రీరఘూత్తమా! ౧౧

చతురత; తెల్వి తేటలును; శాస్త్ర విధిజ్ఞత వాక్పటుత్వముల్
వితతము లౌచు గల్గినను భీకర దుర్విషయాఽనురక్తులై
పతితులు నైన దుర్జనులు భవ్య మణి ప్రతిభూష్య సర్వ సం
హతులయి వెల్గు చుండి రసహాయ కుతంత్రులునై; రఘూత్తమా! ౧౨

భయపకు లేడి కంటి బలువయ్యేడు నీరది వేటకానికే
మియు గన ముద్దు రాదుగద! కానగ నీ కలికాలమందు ధు
ర్నయ కపటేర్ష్య లౌ ఖల దురాత్మక నేతలు సజ్జనాళి నే
మయిన కలంచ జేతురు ప్రమాదమొనర్తురు, శ్రీ రఘూత్తమా! ౧౩

తీవిగ హింస నొప్పెడు తొడేళ్ళకు; బెబ్బులు లాది క్రౌర్యసం
భావిత జంతు సంతతికి భావము నందు దయార్ద్ర బుద్ధి యిం
తే విధ మొంద నేర దిల; దెల్వైన సాధుల దోచు స్వార్థలో
కావని కెట్లు సన్మతులు గల్గును? గన్గొనగా; రఘూత్తమా! ౧౪

అనిశము జంతు సంహతుల నాకొని కోయు కసాయి వానికే
కనికర మింత రాదుగద! కానగ నీ కలికాల మందు; దు
ర్వినయులు; స్వార్థ తాత్వికులు, విజ్ఞుల మాన్యుల సజ్జనావళిన్
మునుకొని హింస సేయ మతి బూనుదు రెప్పుడు, శ్రీరఘూత్తమా! ౧౫

మాయికులందు సజ్జనుడు మాయికుడై చరియింపగావలెన్
పాయక మోసగాని నిల బల్విడి మోసముతోడ వంచినన్
న్యాయము నేడు లోకమున, నైతిక సత్పథ నిశ్చలాత్ముడై
పోయిన నిల్వ డిమ్మహిని, పొందడు శక్తిని; శ్రీరఘూత్తమా! ౧౬

ముల్లును ముల్లుతోడ పటు మూర్ఖుల మూర్ఖపు దాడితోడ సం
ధిల్లు కుతంత్ర భావులకు తీవ్ర కుతంత్రముతోడ గెల్వగా
జెల్లును నేడటంచు కడు శేముషి యొప్పిన వారి మాట; యిం
దెల్ల విశిష్ట నీతి గని దెల్వగ రాదురా! శ్రీరఘూత్తమా! ౧౭

చెడ్డను మంచితోడ; పటు శీల సుసత్యముతో నసత్యమున్;
గడ్డయి నిల్చు దుర్విధిని ఘాటగు సద్విధితో నధర్మమున్
దొడ్డగు ధర్మ పద్ధతిన తొందర నూనక గూల్చ నెంచు వా
రడ్డులు లేని సత్య గుణ రాట్టులు నుత్తము లోరఘుత్తమా! ౧౮

ఆగ్రహ మింత లేని సుగుణాఢ్యు డహింసకు డాత్మవేది, స
న్నిగ్రహితోరు షడ్రిపుడు; నిష్కలుషుండు; వివేకశాలి; దు
ర్విగ్రహ శూన్యు డిమ్మహిని వేలకు నొక్కడు నుండు; వాడె స
త్యాగ్రహి; దేవ తుల్యుడయి ధారుణి వెల్గునురా రఘూత్తమా! ౧౯

ఇమ్మహి మేటి సద్గుణుడు నెందున నొక్కడు గానరా దొరున్
సమ్మతి దోచు ధూర్త బక చాతురి బోలిన వారలెల్ల; రొ
క్కమ్ముల నెంచు స్వార్థ పర ఘాతుక లోకము లెల్ల వింత బీ
రమ్ముల బల్కుచున్ పుడమి రాజిలుచుండిరిరా! రఘూత్తమా! ౨౦

గుణవతులైనవారు; నయకోవిదులౌ వర సత్య ధార్మికుల్
గణుతి నొనర్చి చూచినను గానగ రారు గదయ్య! నేడిలన్;
పణ మిడి బీద సాదలను పల్మరు స్వార్థము నూని దోచు దు
ర్గుణ మతు లింట బైట గన ఘూర్ణిలు చుండిరి శ్రీ రఘూత్తమా! ౨౧

భారత భూమి దుర్జనుల భారముతో గడు గ్రుంగుచుండె; ని
స్సారము లయ్యె ధర్మ నయ సత్య సుశీల పథంబులెల్ల; వే
సారుచు ధర్మ దేవతలు సాగగ లేక నరాజకంబులం
దారడి చెంది కుంది పలు దైన్యత గాంచిరి; శ్రీరఘూత్తమా! ౨౨

పగ రగిలించు దుర్జనుల బాహు బలంబుల యంద దండగా
నెగడెను స్వార్థ సంహతులు నిండిన క్రూరుల దుర్విధానముల్!
వెగటయి పోయె, ధార్మిక వివేకము సాధు సుశీలతా గుణం
బగణిత శౌర్య! దుర్నయ మపారము హెచ్చెనయా! రఘూత్తమా! ౨౩

పండితులైనవా రడుగు బట్టిరి, శుంఠలు వ్యర్థ లల్పులే
దండిగ నాధిపత్యముల దాల్చిరి, ధర్మ విధిజ్ఞు లెల్ల నో
రుండిన కూడ దుష్కలి నిరోధ మొనర్పక మౌన ముద్రులై
యుండిరి, సద్విధానము లయోమయ మయ్యెనురా! రఘూత్తమా! ౨౪

నాడొక రావణాసురుని నంతము సేయ దలంచి శక్తిపా
రాడగ రామ మూర్తివయి రక్కసు నాజిన ద్రుంచినావురా!
నేడత డిమ్మహిన్ మిగుల నేర్పున వేలుగ జన్మ లెత్తి బల్
దాడి యొనర్చె నెట్టి యవతారము దాల్తువొ? శ్రీరఘూత్తమా! ౨౫

ఈ విపులావనిన్ బలిసి యేపు వహించిరి నాటి దుష్టమై
రావణు డీసు గల్గి యహిరావణు డాశతకంఠ రావణుం
డా వికృతాత్ముడైన ఖరు డాదిగ రక్కసు లెల్ల, చూడ మీ
రేవిధి వీరి నార్పుదు రరిందమ! తోచదురా! రఘూత్తమా! ౨౬

చేతములందు సద్విధులు చెల్లని ధూర్తులు; ప్రజ్ఞలేని దు
ర్నీతులు; పశ్యతోహరులు; నిర్గుణు లంధులు; దుర్విదగ్ధులౌ
నేతలు; నేడు కాపథపు నీతుల సాగుచు నీధరిత్రికే
ఖ్యాతిని గూల్చుచుండ్రి వెటకారము గూర్చిరి; శ్రీరఘూత్తమా! ౨౭

నీదగు రామ నామమును నేరుపు మీర జపించు చుండి బల్
మోదముతో పరార్థముల పూని హరించుచు త్యాగు లట్లు; సం
వాదము జేసి చేసి విభవాఢ్యుల బీదలఁ దోచి సత్ప్రజన్
మోదుచు నుంద్రు నేతలగు పుంశ్చలి పుత్రులు; శ్రీరఘూత్తమా! ౨౮

కాదన కెట్టిపాటి యపకారము నైన నొనర్త్రు దుష్ట సం
వాదులు; సాధు గో ద్విజ ప్రపంచము కెల్లపు డాసురోరు కా
కోదర బుద్ధులౌ ఖలులు క్రూరత నొంచిరి సత్యవాదులన్;
లేదుర నీతి లోకమున లేశము; చూడగ; శ్రీరఘూత్తమా! ౨౯

నీదగు రామ రాజ్య మగునే యిది చూచిన కాదు కాదు వి
శ్వోదయ మైన సత్య శివ సుందర తేజము పూజ్యమయ్యె; నెం
తో దయనీయమౌ స్థితిని దూగెను భారత రాజ్య లక్ష్మి; దు
ర్వేదన బొందె ధర్మము లరిందమ! యిమ్మహిలో రఘూత్తమా! ౩౦

పాయని ద్రోహ చింతనలు, పల్మరు నెంచెడు దుర్విదగ్ధ రాం
ఢేయుల పాలనమ్మున వడిన్ దెగి కూలె ప్రజానుతంతువుల్
మోయని దుఃఖ భారమున మూల్గెను సత్ప్రకృతీందిరాఽవనుల్
త్రోయగ రాని దుష్ట కలి త్రొక్కెను పున్నెము; నోరఘూత్తమా! ౩౧

మానవతాను ధర్మములు మాసెను మానవ జాతిలోన దు
ర్దానవతాను ధర్మములు దౌష్ట్యముతోఁ జెలరేగె నిమ్మహిన్;
కానలఁ జొచ్చు చుండి రెటుగానక ధర్మ పథానుచారులో
దీనశరణ్య! సజ్జనులు దిక్కరి నారయ, శ్రీరఘూత్తమా! ౩౨

ఎచ్చట జూచినన్ ఖలులు నేహొనరించెడి స్వార్థ చింతనల్;
ఎచ్చట గాంచినన్ కరువు లెన్నగ జాలని కాటకంబులున్;
రెచ్చుచు భారతాంబను హరించెను; చూడగ సత్పథంబు ని
పచ్చరమయ్యె నీయునికి పర్విన నీపుడమిన్ రఘూత్తమా! ౩౩

పచ్చని పైడి పంటలు సెబాసన పండెడి కర్మభూమి యే
స్వచ్ఛత లేని దుర్జనుల స్వార్థ కుతంత్రత రెచ్చి పోవగా
పుచ్చుల బీడులై; దురిత పూర్ణములై; కళ దప్పి పోయి బల్
క్రుచ్చిలు మూర్ఖ జాతికి ప్రమోదము గూర్చెర! శ్రీరఘూత్తమా! ౩౪

ఛల కప టేర్ష్యలై దురిత జాతి పిశాచము లెల్ల వేళలన్
కలసి చరించి దుర్విధులఁ గాంగ్రిడిలుచున్ మహి వెల్గు చుండి స
త్కుల మత జాతి సంస్కృతుల కూకటి వ్రేళ్ళ దెరల్చ నెంత్రు; నే
నిల నిముసంబు నిల్వనుర! నీవెటు లుండెదవో! రఘూత్తమా! ౩౫

భారత ధార్మిక స్థితులు భద్రత గూర్చెడి సత్య శీలముల్;
క్రూరులు మానవాకృతుల గూడిన రాక్షస లోక మెల్ల ధి
క్కారము తోడఁ జేయు కలికాలపు మారణ హోమ మందు ని
ష్కారణమౌచు గూలినవి; కాంచి సహించెదవా? రఘూత్తమా! ౩౬

స్త్రీ పురుషాళిలో నియమ శీలత సభ్యత సాధు వర్తనో
ద్దీపన మైన బుద్ధియును తెల్వియు పూర్తిగ కృంగుచుండె నే
పాపమొ భారతావనిని పట్టి చలంబున బీల్చు చుండె, నీ
వేపగి దూరకుండెదవు? వేదన గల్గదొకో? రఘూత్తమా! ౩౭

నీవిల నుంటివా యసలు? నిల్చిన నేమి? యరాజకమ్ము లే
పై వెలుగొందె నిమ్మహిని; పావన మూర్తుల యార్తనాదముల్
దేవ! వినంగరావా? పలు తీరగు వంతలలోన సాధు లో
కావని చిక్కి స్రుక్కె ననఘా! కనుగొంటివ? శ్రీరఘూత్తమా! ౩౮

రాక్షసు లెట్టివారొ వివరంబున దెల్పెదు పిన్ననాట నా
కక్షయమైన నీపుడమి గల్గిన స్వార్థ పిశాచ భావనా
కుక్షులు నైన మానవులె క్రూరపు రాక్షసు లంచు నేడు నీ
సాక్షి నెఱింగినాను మనజాలను నన్ననుమా! రఘూత్తమా! ౩౯

ఏమొ వచించినా నెఱుగ నేరని వానికి జెప్పి నట్లు, నే
నేమొ యెఱింగి నట్లు; గన నేరవె? నీవిల మంచి చెడ్డలన్?
స్వామి! అహంకృతాత్మనయి వాక్చపలత్వముఁ జూపినాదయే
దోమది కుంద నంటి, వినతుండ క్షమింపుము నన్; రఘూత్తమా! ౪

—: o :—

శ్రీః
శ్రీ హయగ్రీవాయ నమః
శ్రీ సరస్వత్యై నమః

# సంస్తుతి

శ్రీకర ధర్మ రక్తి; వివ
శీకృత మౌని హృదబ్జ దీప్తి, సీ
తా కమనీయ సద్గుణ వి
తాన సుమౌక్తిక నీల శుక్తి, భ
ద్రాకర నిత్య సూరి జన
దర్శితమౌ పర తత్వ కాంతి; లో
కైక కళా ప్రసక్తి యెద
గల్గుదు నీవని శ్రీరఘూత్తమా!

మాయల మారి లోకము సమస్తము శాశ్వత మంచు నమ్మి నీ
ధ్యేయము మాని తీవ్ర పరిదేవన మొందగ జేయు తుచ్ఛమౌ
కాయమె సుస్థిరంబనుచు గానని వానిగ దుష్ట కర్మలన్;
చేయక చేసి హీనునయి చేరితి నిప్పుడు నిన్ రఘూత్తమా!

ఆశలలోన జిక్కుకొని యారని[1] దుఃఖ సుఖాల వహ్ని లం
దే శలభంబు లట్లు పటు తీవ్రతతోడ భ్రమ ప్రమాదినై
ఆశయ సిద్ధి గల్గు నని యారడి నొందుచు జిక్కి సృక్కి య
త్యాశలడంగ; గన్దెరచి దాసుడ నంటిర! శ్రీరఘూత్తమా!

---

1. కష్ట.

గంగ దురంత పాపమును, కానని తాపము జంద్ర చంద్రికల్,
రంగుగ కల్పవృక్షము దరన్ గల దైన్యము నెల్లఁ బాపు సి
స్సంగుడు నీ పదాల గనజాలిన పాపము తాప దైన్యముల్
భంగములౌచు పోవునని వచ్చితిఁ జేరితి నిన్ రఘూత్తమా! ౩

ఈ కలి మాయ లెల్లపుడు నేపు వహించి జగాన నన్ను చీ
కాకులు పెట్టి పెట్టి మది గాసిల ద్రొక్కుచు నంతు లేని దుః
ఖాఽకుల వార్ధి ముంచి వెటకారము జేయుచు నుండె; వీనిపై
నీ కడగంటి చూపొలుక నిమ్ము రవంత; ప్రభూ! రఘూత్తమా! ౪

ఏకములయ్యి షడ్రిపులు నేర్పడ కుండ హృదబ్జ వీథులన్;
ప్రాకట మొప్ప దాగి పలు వైరము లూనుచు నిప్పులేక నన్
చేకొని కాల్చి పేల్చి పలు చిత్ర విచిత్ర దురంత హింసలన్
మేకొని పెట్టు చుండి కడు మేలము లాడిరయా రఘూత్తమా! ౫

నాకగు పూర్వ దుష్కృత మనారత మాగక వెంట నంటి, నా
నా కఠినంపు లేముల ఘనంబుగ గూర్చుచు దుస్తరంబులౌ
భీకర రాగ రోగ భవ పీడల బాధలలోన గూల్చె నన్,
నీ కరుణార్ద్ర దృక్కు లిడనేరవ? యేలవ నన్? రఘూత్తమా! ౬

నీ కడు సోయగంపు కృప నిల్చిన నీ కడగంటి చూపులన్
సోకగ నిమ్ము; నీ యడుగు సొంపు సిరిన్ నెఱ నమ్ము వీనిపై;
ఆకొని యీషణ త్రయము లారడి బెట్టుచు నుండె రార! రా
మా! కరుణింపు, నా వెతలు మాలిమి గావొకొ? శ్రీ రఘూత్తమా! ౭

నీ కమనీయమౌ సిరులు నిండిన నీ పద నీరజాల; ౘెం
పై కరుణాఽమృతం బొలుకు త్వత్కమలాఽయత లోచనాల; సొం
పై కనుముద్దు గొల్పు జిగి పర్వెడు నీ నగు మోము చందురున్
నా కనులార గాంచగ నొనర్పుము; వేడెదరా! రఘూత్తమా! ౮

నీ కల సుస్మితంబు నెద నింపితి; నీ పద పద్మ రాగమున్
చేకొని యుంటి నాతలఁపు చెంగట, చెల్వగు నీల నీరద
శ్రీ కిరవైన నీ తనువుఁ జేర్చితి మామక మానసంబునన్;
నా కిక నీవె దిక్కనుచు నమ్మితి కావవె! శ్రీ రఘూత్తమా! ౯

సోకగ నీపదంబు; శిల సుందరి యౌటయె వింత; చూడ కై
తాకగ; బెండు వోలె ప్రమధాధిపు విల్లది త్రెళ్ళ వింత యో,
నీ కమనీయ నామ మిడ నీరధిఁ గొండలు దేల వింత; భ
క్తైక సుఖావనంబులు సదా కడు వింతలెరా! రఘూత్తమా! ౧౦

ఓకరుణానిధీ! శుభ కరోన్నత సద్గుణ రత్న వార్నిధీ!
చేకొను నన్ను; నీ చరణ సేవక దాసుల దాస దాస సే
వా కమనీయ మానసుల భవ్య పదంబుల దాస దాసుడన్;
సోకగ జేయు వీని పయి సొంపగు నీ కృపలన్ రఘూత్తమా! ౧౧

నాక సుఖమ్ము లిమ్మనుచు నర్మిలి వేడగ రాను నిన్ను; నా
నా కఠినంపు నారకము నార్పగ రమ్మని కోరరాను; నా
కై కలుముల్ సుఖంబులును గల్గగఁ జేయు మనంగలేదు; కా
నీ కరుణన్ త్వదంఘ్రులను నిమ్మను మంటినిరా! రఘూత్తమా! ౧౨

చక్కని వాడనంచు, సొగసౌ తొలి పల్కుల కందలేని సౌ
రెక్కిన వాడ నంచును; విరించి పురారి సురాళి యూహకే
చిక్కని వాడ నంచు; జయ శీలుడ నంచు; జగత్స్వరూపినం
చెక్కడ లేని గర్వమున జేరవు పిల్చిన నన్, రఘూత్తమా! ౧౩

అలసితి యీ యసహ్య ఖలు లార్చుట వాక్కటిలాలు సేయగా;
నిలువగ జాల నీ కుటిల నీచుల వంచన లాలసాలలో;
పలు వ్యథ లందు తాకు వడి బల్వడి స్రుక్కి చలించె మానసం
బలఘు చరిత్ర! ప్రాంజలిడి వచ్చితి నీదరికే; రఘూత్తమా! ౧౪

శ్రీలలితాఽలవాల! తులసీ నళినాక్ష ప్రసూన మాలికా
జాల! వినూత్న నీల ఘన చారు తనూజ్జ్వల! లుబ్ధ్యమాన ము
గ్ధాలక లాలితోర్ధ్వ తిలకాంచిత సార్ధ శశాంక ఫాల! సీ
తా లలనా మృదు స్మిత వితాన విలోల! నతుల్ రఘూత్తమా! ౧౫

బాల సువర్ణ చేల! పరిపంథి మదేభ భయంకర రోరు బా
ణాలఘు చాప శోభిత గుణాఽకర సాహస శౌర్య శీల! భ
క్తాళి మనోనుకూల! విబుధాళి నుతోజ్జ్వల ధర్మ జాల! నా
నా లులుభాఽఘ నాశకర నామ గుణాఽమల! శ్రీ రఘూత్తమా! ౧౬

వేలను మించు పాపముల వేడ్క నొనర్చి తవజ్ఞ బుద్ధినై;
చాలిన శత్రు షట్కముల సఖ్యత నొందితి; దుర్విదగ్ధునై
కూలితి పేక మేడలుగ కుప్పయి దుర్విషయాఽభిలాషినై;
ప్రాలితి నీ పదాబ్జముల వ్యర్థ మనస్కుడనై; రఘూత్తమా! ౧౭

[1]రాలెడు జీవితమ్ము; కనరాని దురంత భవేతిబాధ, దుః
ఖాలయమైన దైహిక సుఖంబులు; నీ మెఱమెచ్చులౌ దురా
శాలతికానుబంధము లసహ్యములై పలు హింసలందు నన్
గూలఁగఁ జేసె; నిన్ శరణు గోరితి కావవె! శ్రీరఘూత్తమా! ౧౮

నీ లలితంపు పాద నళినీ యుగళిన్ మది నిల్పు కొన్న నీ
పాలిటి భక్త లోక పద భక్తుల భక్తుల నమ్మి యుంటి; న
న్నేలు దయాంబు రాశి వని; నీరజ లోచన! చేర వచ్చితిన్;
కేలిడి చేదు కొమ్ము; పరికింపుము దీనుని నో రఘూత్తమా! ౧౯

కాలుని దున్న పోతు చిరు గంటల సవ్వడి మెచ్చుచుండి దో
షాలకు దోసి లొగ్గెడు నృశంసపు లోకము నందు నిల్వగా
జాల, నపారమైన భవ సాగర దుస్తర బాధ నీది రా
జాల; భవ తర్కరాబ్జ మిడి చయ్యన చేకొను నన్; రఘూత్తమా! ౨౦

1 రాలిన

శ్రీ లలరారు నీచరణ సేవలఁ గూర్పవె! యంతె చాలు; నా
కేల భవాల గోల; విసిగెత్తెను జీవిత మెల్ల; శుష్కమౌ
ఖేలన మందు; దుష్ట విజిగీషుల యీర్ష్యల లోకమందు; నీ
పాలిట బద్ధవాడను కృపాంబుధి! కావవె! నన్ రఘూత్తమా! ౨౧

ప్రేలితి పిన్న పెద్దనక పెల్చ నహంకృతి భూత మూన; దో
షాలకు బుట్టి నిల్లయిన షడ్రిపు యూధము నందు జేరి; దు
ర్లీలలఁగన్ను మిన్ను గన లేక నొనర్చితి; నింత నైన నీ
యాలప మొంద లేక వెలియైతిని జేరితి నిన్ రఘూత్తమా! ౨౨

కాల కరాళ తీవ్రతర కాల భుజంగ మహోగ్ర దంష్ట్రికా
జాల విఘట్టనమ్ముల నసహ్యములై; బహుళ శ్లథంబులై;
కూలుచు నుండె దుర్విషయ కోటి రిరంస చలేంద్రియాలు; మో
హాలసమై మనంబు నిను హత్తదు, కావవె! నన్ రఘూత్తమా! ౨౩

కాలిచివేయుచుండుసురు గల్గని దేహము నగ్ని కాటిలో
వేళలు లేకయే యుసురు వెల్గిన దేహము నెల్ల క్రూర దో
షాలకు లొంగు చింత లనిశంబు దపించుచు గాల్చుచుండ నీ
యాలప మొంద దయ్యె! హృదయంబు; కృశాత్ముఁడరా!
రఘూత్తమా! ౨౪

నాశము లన్ని ద్రెళ్ళ నిను నార్తిన నే నిట బిల్చి పిల్చి నా
నాలుక శుష్కమయ్యెను ఘనంబయి యారని తృష్ణ దీప్త దు
ర్జ్వాలన తప్తమై యెదద రంధులఁ జిక్కి దహించుచుండె; నీ
వేళ లసహ్యమాయె; గనవే! నిలుపోపని నన్; రఘూత్తమా! ౨౫

మాలిమి గావొ? నామొరలు? మాధవ! నేనిట ద్రోవ దప్పి తో
డేలుల మధ్యలో మృగము డీల్పడి చిక్కిన యట్లు మేటిదో
షాలకు దోయి లొడ్డిన నృశంసుల యూధములందు జిక్కిపో
జాలక దారి తెన్ను గన జాలక పిల్చితిరా! రఘూత్తమా! ౨౬

ఉలుకవు పల్కవేమి? యెద నూనవు నా మొర; ధూర్త దు
ష్టల కపటేర్ష్య మైన కలి కాలపు లోకము నందు లిప్తయేన్
నిలువగ జాలఁ వేదనలు నిండెను నా బ్రతు కెల్ల; చాల నిన్
పిలిచితి; వేన వేలు నిను వేడితి; కావవె నన్; రఘూత్తమా! ౨౭

లీల ఖరాది దుర్దనుజులెల్లర నొంచితి వుగ్రమూర్తివై
వాలిని జంపి భానుజుని వర్ధిల జేసితి వాదశాననున్
రాలిచి యా విభీషణుని రక్షణ జేసితివయ్య! మత్కలిన్
గూలిచి యేలు కొమ్ము నను; గోరుచు చేరితి నిన్; రఘూత్తమా! ౨౮

కాల కరాళ మానసుడు కాక ఖలాఽసురు డాశ్రయింప, స
చ్ఛీలత తోడ వాని నిరసింపక వత్సలతా గుణంబులే
జాలులు వార, జాలి గొని చక్కగ నేలితి వయ్య! పీనిపై
నేల దయారసం బొలుక నివ్వవు? వేడితి నిన్; రఘూత్తమా! ౨౯

కాలుచు కూలు చుంటి; కలి కాల మహా ప్రిదపు షట్క వహ్ని కీ
లాల తపించి పోయి, యవలక్షణ దుర్విషయానురక్త దో
షాలు వెలుంగు చున్న భవ సాగరపుం సుడులందు నిల్వగా
జాలక మీ పదాబ్జముల సాగిలితిన్ గనవే! రఘూత్తమా! ౩౦

ఆ లలనా మతల్లిని నహల్యను బ్రోచితి వాగుహున్ దయన్
పాలన జేసి తాశబర భామిని యెంగిలి పండ్ల మెక్కి నీ
వాలలనన్ కృపన్ గనితి వాకపి భక్తుల గాచి తీవె, న
న్నేల భవ త్కృపా సరణి నేలవు? దిక్కరితిన్; రఘూత్తమా! ౩౧

పలుక వదేమిరా? సుజన పాల! పరా కిటు లేల? నాపయిన్
చిలుక వదేమి? నీకృపలు చిందెడి చల్లని చూపు జల్లులన్;
కలవర పెట్టకోయి! పడిగాపులు గాచితి నీదు జాడకై
చలములు మాని పీనిపయి జాలిని జూపవె శ్రీ రఘూత్తమా! ౩౨

పేరిమి మీర గోరి నినుఁ బిల్చినఁ బల్కవు? పల్కు లన్ని బం
గారము లాయెనా? కనుల గానవు? దీనుడు చుల్కనాయెనా?
భారము లౌనె బిడ్డ లిల బంగరుతల్లికి? నీకు నేను పె
న్భారము నైతినా? వెగటు వారకు దాసునిపై; రఘూత్తమా! ౩౩

నా మది నిన్ను బిల్చె నది; నవ్య మనోహర దివ్యరాగ మై
కోమల మైన గానమయి కూర్మల కెల్లను కూర్మి ప్రాణమై
శ్రీమృదు గౌతమీ లలిత సీతల మంద్ర తరంగ నాద మై
రామ! వినంగ లేవొ? కనరా! ననుఁ గావర! ఓ రఘూత్తమా! ౩౪

నీ కమనీయ రూప మెదనింపితి; నీ నగు మోము చందురున్
నా కనులార చూచు కొను నట్లొనరింపుడు; మీ పదాబ్జ సు
శ్రీ కలుగంగఁ జేయుడు; విశేష సుఖంబది నాకు చాలు నం
తే; కరుణింపుడయ్య! కడు దీనుడ! చేరితి నిన్, రఘూత్తమా! ౩౫

ఈ విపులైక లోకముల నింతగ బాధయు లేక బ్రోచ్చులో
నే విధమైన సంకటము లేర్పడ నీయక నిల్పుకొన్న నీ
కీ వెల లేని పీనిఁ బరికింపఁగ నేలుట భారమాయెనా?
పావన మూర్తి! పీడెపుడు భారము కాదుర! శ్రీరఘూత్తమా! ౩౬

మీరు సమర్థులైన పరమేశ్వరులే కద, శక్తి యుక్తులే
మీరిన సత్స్వతంత్రులగు మేటి సుధీరులె; యిచ్చ వచ్చి పల్
దారుల బోవువా రెటకుదారతఁ బోయినఁ బొందు, నన్ను మీ
వారిజ పాద సన్నిధిని వర్ధిల నుంచుడు; శ్రీరఘూత్తమా! ౩౭

నే నిట నీదు సొమ్మనిన నిశ్చయమౌ మృగ తృష్ణ వృత్తియౌఁ,
కానగ నీవు నా పతివెగా యనినన్ గగన ప్రసూనమౌ;
నే నిట నీ పదాబ్జముల నిల్తు ననందుగు మాట నిక్కమౌ;
నే నెటువంటి యుక్తులను నెంచను బ్రోవవె నన్, రఘూత్తమా! ౩౮

: శ్రీశుభంభవతు. :

— : ౦ : —

శ్రీః

# స్వామి సౌందర్య వర్ణన స్తుతి

శ్రీకిరవైన నీ సొగసు;
చెన్నలరారు కృపా రసమ్ము; పెం
పై కను దమ్ము లందు కడు
వర్ధిలు చక్కదనాల మోము; మో
దాకరమైన చల్లని యు
దార కృపారస మున్న డెందమే
మో కను విందు సేసి, నను
ముగ్ధుని సేయు; ప్రభూ! రఘూత్తమా!

నీవనసొంపు; ఘోర భవ నీరధి తారక మైన నీ గుణ
శ్రీ విన సొంపు; మీ కథలు చేరిచి పాడిన పాట సొంపు; నీ
భావము సొంపు; సత్కృపలు పర్వెడు తావక దృష్టి సొంపు, భ
క్తావన బుద్ధులెల్ల వినుతం బగు సొంపులురా! రఘూత్తమా! ౧

చక్కదనంబ నీ తనువు; చక్కని రూపము; సద్గుణంబులే
చక్కదనంబు లాశ్రితుల సాకెడు వత్సలతా గుణంబు మే
ల్చక్కదనంబు; ధర్మ మగు స్వాంతము చక్కదనంబు చూడ నో
చక్కదనాల తండ్రి! నను చక్కిడి బ్రోవవె! శ్రీరఘూత్తమా! ౨

అన్నుల మిన్న లే వలపు కన్నను; ముద్దుల చంటి పాప లే
వెన్నెల నవ్వు మోవి నిడు వింతగు తీయని ముద్దు కన్న, పా
ల్జున్నుల కన్న; తేనియల జొంపము కన్నను; వెన్న కన్న; ఓ
రన్న! త్వదీయ నామ మధురంబులె మిన్నలురా! రఘూత్తమా! ౩

సన్నుత మైన నీ తనువు చక్కదనంబులు నెన్న మిన్న; వెం
పున్న మనోజ్ఞ ధర్మముల బూని మెలుంగుటె మిన్న; నీదు సం
పన్నపు రామ రాజ్య మిల భాసిల జేసితి వన్న మిన్న; రా
మన్న! భవ త్కృపాళి ఘన మన్నిట మిన్నర! శ్రీరఘూత్తమా! ౪

ఎన్నడొ నీ దయారసము నెప్పుడొ కాదుర! యిప్పుడేను; నీ
కన్న మరెవ్వరిన్ మదిని గానని వీనిపయింతఁ జిల్క రా
వన్న! యెఱుంగకే నెఱిగి పాల్పడి చేసిన మేటి దోస మే
మున్న క్షమింపు మన్న; నను బ్రోవగదన్న! విభూ! రఘూత్తమా! ౫

అన్న! దయన్గనన్న! భవ దంఘ్రుల నాత్మన నమ్మువాడు వీ
డన్న! భవానుభూతి వెగ్గై నిను జేరిన భక్తు డన్న! నీ
మన్నన గన్న దాస జన మాన్యుల దాసుల దాసు డన్న! రా
మన్న! కృపామృతంబు లిడు మన్న! త్వదాశ్రితుడన్;రఘూత్తమా! ౬

విమల పయఃప్రపూర్ణ మయి వెల్గెడు నూతుల నూటి కంటె; క్షే
మము నిడు భావి యొక్కటియె మంచిది; భావుల నూర్లకంటె య
జ్ఞము కడు మేలు; యజ్ఞ శత సంఖ్యల కంటెను మేలు ధర్మస
త్యము లిల; వీని కంటె భవ దంఘ్రుల సేవయె మేల్ రఘూత్తమా! ౭

అడవుల కెల్ల వృక్షములు నందము; వానికి పూల సంపదల్
కడు బిగువైన యందములు; గాంచగ పూలకు తావులందముల్;
తడయ నిశాంబరాంగనకు తారక లందము; వాని కందమౌ
నుడుపతి; యాత్మ కంద మెద నూనిన నీ స్మృతు లోరఘూత్తమా! ౮

పాటకు రాగ మంద మెద బాటయి కూడిన ప్రేమ యందమౌ
ఆటకు తాళ మందము; స్మితంబుల సిగ్గులు నాతి కందముల్
మాటకు సత్య మంద; మభిమానమె యందము సజ్జనాళికిన్
సాటియె లేని నీ చరణ సన్నిధె యంద మయా! రఘూత్తమా! ౯

అడుగక యిచ్చు కొన్న మన నయ్యది ముద్దు; పసిండి పంట చే
నెడదకు ముద్దు; లందు కొననీయక నిచ్చిన నంద మయ్యదే
కడు నను ముద్దు; కాంచియును గాంచని లే వలపెల్ల ముద్దు; నీ
యడుగులు చెప్ప కిచ్చుకొని యాదుటె[1] ముద్దగురా! రఘూత్తమా! ౧౦

చిత్రము నీ స్వరూపములు; చిత్రములే భవ దీయ తత్వముల్
చిత్రము సృష్టి సంస్థితులు; చిత్రము నీ లయకృద్వినోదముల్
చిత్రము ధర్మ పాలనము; చిత్రము భక్త పరాయణత్వ మో
చిత్ర విచిత్ర భావ! నను జేకొన చిత్రమ? శ్రీరఘూత్తమా! ౧౧

ఆవిలమయ్యె నా హృదయ మారని ఘోర భవైక బాధలో
తావుల దప్పె ప్రాణములు దారుణ షడ్రిపు చిత్ర హింసలో
లావు లడంగె; దుష్కలి బలంబున దుర్విషయాబ్ధిఁ దోసెరా!
నీవె శరణ్య మన్య మెద నెంచను బ్రోవవె! నన్ రఘూత్తమా। ౧౨

ఇమ్మని వేడ లేదు భవ మీదెడు నైహిక సౌఖ్య మెల్ల; రా
నిమ్మని కోరలే దెపుడు నిర్జర లోక విలాస భోగ మం
దిమ్మన లేదు, లౌకికపు తీయని కోర్కెల నెల్ల; నన్ను చే
కొమ్మను మంటి; నీదయల గోరితి నింతియె, శ్రీరఘూత్తమా! ౧౩

మండిత సద్గుణుండ వయి మా జనకాత్మజుఁ గూడి యుండి నా
దండన నిల్చి యుండినను "మా రఘు రాములె తండ్రి యంచు వే
దండము నెక్కి భేరికను ధాటిగ" దాండడ డాండ యంచు బ్ర
హ్మాండము నిండ మోది విజయమ్మునఁ జాటుదురా రఘూత్తమా!॥ ౧౪

శ్రీసతి జానకి సతిగ; సేవలొనర్చు మదు త్సుతాదులౌ
దాస జనాళి వైష్ణవ విదాంవర కోటియె గాగ; గౌతమీ
శ్రీ సరి తంబరాపగను; శ్రేష్ట వికుంఠమె యిప్పురంబుగా
భాసిల మోక్ష ధామ మిదె భక్తుల కేర్పడెరా! రఘూత్తమా! ౧౫

---

1. ముద్దులురా!

నీవె కదయ్య! మా కవని నిక్కపు తల్లివి; తండ్రి వీవె; మా
కీవె సఖుండ వాప్తు డవు కీర్తిత విద్యయు బంధు వీవెరా!
నీవె గురుండ వర్ధముల నిచ్చెడిదాతవు, దైవ మీవెరా!
మా విభు వైన మా గతియు మా పతి వీవె గదా! రఘూత్తమా! ౧౬

—: o :—

శ్రీః

శ్రీ సీతారామాభ్యాం నమః

# అమ్మతో మనవి

శ్రీ శుభ వైభవంబు లెదఁ
  జిందిల; పూర్ణ కృపా పరంపరల్
శ్రీ శమదాది సద్గుణపు
  రీతులు చల్లని కన్ను దమ్ములం
దాశయ సిద్ధి గూర్ప; ముఖ
  తామరసంబున నవ్వు లొల్కఁ శ్రీ
దాశరధీశు రాణివగు
  **తల్లి!** నుతింతును నిన్ రఘుప్రియా!

**తల్లి!** జగ త్రయంబులను దాల్మిన నేలెడి మేటి సీతమా
**తల్లి!** దయా రసమ్ము కను దమ్ముల నింపెడు కన్నతల్లి! మా
చల్లని కల్పవల్లి! మనసారగ గొల్చెడి భక్తు నేలగా
నుల్లము పల్లవింపఁ కడు నోర్పున జూతువటే! రఘుప్రియా!

మమ్ముల బ్రోవు మంచు బ్రతిమాలుచు దెల్పవె స్వామితోడ సీ
తమ్మ! సతీ మతల్లి! దవు దవ్వుగ జేరి ప్రశాంతవేళ; లో
కమ్ముల బ్రోచు తల్లివని కాంక్షన జేరితి; నీపదాబ్జ సీ
మమ్ముల జూపి బ్రోవగదె మమ్ముల; మ్రొక్కెద నోరఘుప్రియా!

ఓరిమి మీర నే వెతల నోపని తీరును; చక్కనైన శృం
గారపు వేళ; శాంతములు గల్గిన నెమ్మది గాంచి; స్వామితో
చేరువ నొచు కూరిమినఁ జెప్పవె! సీతమ తల్లి! వీనిపై
గారవ మొప్ప సత్కృపల కల్ముల జల్లవె! మా రఘుప్రియా!

అంతము లేని దుర్భరము లైన మదీయ మనో వ్యధావళిన్
స్వాంతము కెక్కు నట్లొనరఁ జక్కని తీరుల రాముతోడ; నే
కాంతపు వేళలందు దమి గల్గగ లేముసి నవ్వు జిల్కుచున్
చింత లడంగగా దెలియ జెప్పవె! మాజననీ! రఘుప్రియా! ౪

మోసముతోడ నీ దరికి పూనిక గల్గఁ జేరవచ్చి కా
కాసురు డెగ్గు సేసి గతి గానక నీ పద సీమ వ్రాల, "నీ
దాసు డటంచు రామునకు దాల్మిన దెల్పుచు వాని గావగా
జేసితి వంట! మమ్మెరుగ జెప్పవె! రామునికో రఘుప్రియా! ౫

చల్లని పేర్మి జల్లులను చల్లని చూపుల జల్లు చుండి రం
జిల్లగ పూల పాన్పు పయిఁ జెల్వము లూరగ నీదు స్వామి సం
ఫుల్ల సరోజ పాదముల పూని సపర్యలు చేయుచుండి నా
యుల్లము లోని బాధల నయోక్తుల దెల్పవె! ఓరఘుప్రియా! ౬

అమ్మ! దయాంబు రాశివి గదమ్మ! జగన్నుత సద్గుణైక పుం
జమ్ములు నొక్కరూపమయి చక్కగ వెల్గిన దానవమ్మ! క్షే
మమ్ముల గోరి భక్త జన మానస మందు వసింతు వమ్మ! నీ
తమ్మ! యెఱుంగజేయు నను, తావక నాథుని కోరఘుప్రియా! ౭

సంతస మున్న వేళ, సరసంబగు పల్కులు బల్కు వేళ, నీ
చెంతకుఁ జేరి ప్రేమ వివశీకృత మానసు డౌచు నీదు యే
కాంతము గోరు వేళ, గతి గల్గని మీ పద దాసుఁడైన నా
వంతల దెల్పి బ్రోవు మనవమ్మ! నయోక్తుల నోరఘుప్రియా! ౮

అలిగిన వేళ నీవు; ప్రతి మాలగ వచ్చిన వేళ; రామ చం
ద్రులకు; మదీయ దుర్భరపు దుస్థితి నెల్ల నెఱుంగునట్లుగా
దెలుపుము; నన్ను బ్రోవ దగు తీరుల నొట్టుల బెట్టి పల్కవే!
కలుగగ జేసి సత్కృపల గావగఁ జేయవె! నన్ రఘుప్రియా! ౯

తల్లి! దయార్ద్ర వైభవ వితాన మనోజ్ఞ హృదబ్జ వల్లి! శో
భిల్లుచు భక్త సంహతిని పేర్మిన బ్రోచెడి కల్పవల్లి! నా
యుల్లము నందు మీ చరణ యుగ్మము నిల్పితి నమ్మ! సీత మా
తల్లి! శరణ్య మీవనుచు దాల్మినఁ జేరితి శ్రీరఘుప్రియా! ౧౦

రాముని ప్రక్క ప్రేమ రస రాశిగ నిల్చి; గుణాల దొంతివై;
క్షేమము గోరి భక్తులను జెల్వగు సత్కరుణార్ద్ర దృక్కులన్
కోమల మానసాబ్జవయి కూరిచి బ్రోచెడు కల్పవల్లి వీ
వే మము గన్న తల్లి! కడు వేడ్కన గావవె! నన్ రఘుప్రియా! ౧౧

అంబవు· భక్త లోక జగ దంబవు; దీన శరణ్య మైన భ
ద్రాంబవు: చారు సద్గుణ వితాన లస త్కరుణాఽమృతాంత రం
గాంబవు; ధర్మ మూర్తి యగు కంజ దళాక్షుడు నైన రాము చి
త్తాంబుజ భృంగివైన వరదాంబవు బ్రోవవె! నన్ రఘూప్రియా! ౧౨

దయ గని మమ్ము నేలు మని తాల్మిన సీతమ తల్లి! రాముతో
నయమున జెప్ప వమ్మ! కరుణాఽమృత పూర్ణ మనోజ్ఞ మూర్తివై
భయ కరమైన దుస్తర భవాంబుధి నీదగ లేని మమ్ములన్
జయ కరుఁడైన నీ పతికి జాటవె! మ్రొక్కెద; శ్రీరఘుప్రియా!

—: ౦ :—

శ్రీః

# రామనామాంకిత స్తుతి

శ్రీ కమనీయ మూర్తి వని
    చిత్తమునం దొనరంగ నిల్పి; చీ
కాకు లుడుల్చు వాడవని;
    కారుణి కాగ్రణి వైన నీకు, నా
కౌ కలికాల దుర్విధులఁ
    గాంచఁగఁ దెల్పు మటంచు నమ్మతో
నేక మనస్కుఁనై పలుకు
    నేర్పున పల్కితి శ్రీరఘూత్తమా!

**ఓమ్** అను రూప వైభవము లుజ్జ్వలమై ధర వెల్గ నెంచి యీ
రామ మనోజ్ఞ నామమున రంజిలు నీ లలితాఽతిరూపమై;
శ్రీ మధు రైక రూపమునఁ జెల్వగు జానకిఁ గూడి; విశ్వ సం
క్షేమము గోరి వెల్గె నని చేతమునన్ దలతున్ రఘూత్తమా!

నను గన లేవా? దాశరథి! నమ్మితి నిన్ను దయా పయోనిధీ!
అనిశ మిహైక భోగముల యాశలలో బడి తేలుచుండి మా
నని వెతలందుఁ జిక్కుఁకొని; నశ్వరమౌ ననురాగ బద్ధునై
కను గొన జాల కుంటి నిను గాసిలి చేరితిరా! రఘూత్తమా!

మోమర ద్రిప్ప బోకు; కయి మోడ్తుర! దీనుని దిక్కుఁ జూడు, నీ
నామ మనోజ్ఞ వైభవ మనారత మాత్మన నిల్పు కొంటి; నీ
వే మనసైన దైవ మని పేర్మిన నమ్మి యనన్య చిత్తునై
యేమర కుండ గొల్చి ముడియేనని జేరితి నిన్; రఘూత్తమా!

రామ యటంచు నెమ్మదిని రంజిల నమ్మిన చిత్తశుద్ధితో
నేమరకుండ బల్కినను నింతగ పాపము లంట వంట! నీ
నామ మహాత్మ్య మెవ్వరికి నారయ దెల్యగ రాదటయ్య! ఓ
శ్యామ శరీర సుందర! దయామయ! బ్రోవవె నన్; రఘూత్తమా॥ ४

మన్నన గన్న రాజ కుల మందలి వీరుల కన్న నీవు మే
ల్మిన్న వటన్న! మీ సుగుణ మెన్న శుభ ప్రదమౌ నటన్న! ని
న్నన్నిటఁ బెంపుసేయు శరణాగత రక్షణ సద్గుణమ్ములే
యెన్నగఁ జాలమిన్న యట! యేమని పల్కుదు నిన్; రఘూ॥ ౫

చందురు నందుఁ జూడ విరసంబగు మచ్చయు నుండు గాని నీ
యం దిసుమంత నైన నదియా కనుపింపదు చూడ నెందు; నే
మందును గాని; యున్ననది మంజులమౌ నెదపైన మచ్చగా
నుండని యందు, మంగళము[1] నొందుచు నున్నదిరా! రఘూ॥ ౬

ద్రావ మొనర్ప జేయు మెడదన్ గల షడ్రిపు రాక్షసావళిన్;
నీ విమలార్ద్ర సత్కృపల నిచ్చి భవ త్పద దివ్య నీరజ
శ్రీ వితతైక సన్నిధినిఁ జేర్పుము నన్ శరణంటి నీకు; ఓ
భావజ కోటి సుందర! భవ త్పద దాసుడరా! రఘూత్తమా! ౭

యతి పతు లైన వారలు ప్రియా జన బుద్ధుల నూని మోహ సం
హతుల మునింగి తీవ్ర విరహాగ్నుల దేలి రటయ్య! శ్రీశ! నీ
వితత మనోజ్ఞ రూపముల వింత లవేమిటొ? తెల్య రెవ్వరున్
స్తుత మతి నైన నాకుఁ గనఁ జూపు త్వదాకృతి నోరఘూత్తమా! ౮

1. నొప్పుచునున్నదిరా!

## మంగళాశాసనము

జయమగుగాత! మీ కెపుడు జానకికిన్ వరలక్ష్మణార్యకున్;
జయమగుగాత! మారుతికి సాధు జనాళికి భక్త కోటికిన్
జయమగుగాత! మీ భరత సాధ్వికి[1] నాంధ్ర రమా లలామకున్
జయమగుగాత! సత్ప్రజకు చక్కని నేతలకున్ రఘూత్తమా! ౧

నీ కిదె మంగళంబు ధరణీ తనయా హృదయాబ్జ భృంగ రా
జా! కరుణైక సద్గుణ విచక్షణ మానస! రామభద్ర! భ
ద్రాకర మంగళంబులు విదాం వర లక్ష్మణ సూరి వాయుజాఽ
నేక విశిష్ట భక్తులకు నిత్యము గల్గుత! శ్రీరఘూత్తమా! ౨

తప్పులు నెన్ని యున్న కడు దాల్మిన మన్ననతో క్షమించి నా
నిప్పులకుంపటై తలన నిల్చిన నీభవరోగ వహ్నినే
తప్పుకొనంగ జేయుమిర దాసుడ నీకృతిని నిచ్చుకొంటి రా
మప్ప! యనుగ్రహించి కనుమా కృతి నర్మిలి శ్రీరఘూత్తమా! ౩

నా విభు వీవె యంచు మది నమ్మిన వారిని వమ్ము జేయవం
చేవిధినైన సత్కృపలఁ జెల్మిన భక్తులఁ గాతువంచు, నీ
పావనమైన దివ్యపద పద్మములందు మదీయ సత్కృతిన్
శ్రీవినుతాంగ! నుంచితిని చేకొనుమయ్య! కృపన్ రఘూత్తమా! ౪

అస్తు సమస్త మంగళ మహాత్మ్యము లాంధ్ర రమా లలామకున్
ప్రస్తుతి గన్న విశ్వమున భాసిలు భారత లక్ష్మి కెల్ల, శ్రీ
రస్తు; జగ త్రయంబులకు రాజిలు సత్య శివైక సుందర
మ్మస్తు; త్వదీయ కీర్తి కిల మాన్యత లస్తు; ప్రభూ! రఘూత్తమా! ౫

---

1. నాంధ్రరమా ప్రజాళికిన్.

## ఫలశ్రుతి

ఎవ్వరు భక్తి తత్వములు నేపయి మీరఁగ నిశ్చలాత్మలై;
ఎవ్విధి నైన నీ కృతిని నెన్ని పఠించిన నిత్య మోర్పునన్;
దివ్వెలు బాయు వారలకు జెల్లుచు నుండు శమ క్షమాదులున్;
తవ్వల కొద్ది రవ్వలును దాల్మిన గల్గును; శ్రీరఘూత్తమా!

ఇహ పర సర్వ సంపదలు నింపగు జ్ఞానము బుద్ధి విద్యలున్
బహుళ వచో విలాసములు భవ్య శుచిత్వ పటుత్వ ధర్మముల్
సహనము శాంతి సౌఖ్యములు సత్య దృఢవ్రత సర్వ సిద్ధులున్
అహరహ మొప్పి యుండు కృతి నంత పఠించిన శ్రీరఘూత్తమా!

ఓం తత్సత్!

సర్వాసన్మంగళాని భవంతు

ఇయ్యది
శ్రీ గౌతమీ నదీ విలసిత
శ్రీరామసాగర తీరోపాంత ప్రదేశ దివ్యమందిర విరాజమాన
శ్రీ సీతాలక్ష్మణాఽనిలజ సంభావిత శ్రీ కోదండరామ
చంద్రస్వామివారి పాదారవిందములయందు
భక్తిపూర్వకముగా సమర్పింపబడినదై
ముగిసినది.

శ్రీః

# కవి పరిచయము

కృతికర్త :- శ్రీమాన్ నల్లదీగ శ్రీనివాసాచార్యులు, MOL.

గ్రామము : ఇందిరాల, మండలం భూదాన పోచంపల్లి, తా॥ భువనగిరి, జిల్లా నల్లగొండ.

జననము : 1933.

జననీ జనకులు : నల్లదీగ శ్రీమతి శ్రీచూడమ్మగారు, శ్రీమాన్ నరసింహాచార్యులు గారు. (ఇందిరాల శ్రీ గోదాసమేత రాజగోపాలస్వామివారి శ్రీ పాదపద్మారాధన తత్పరులు.)

విద్యాభ్యాసము : V. V. S కళాశాల, సీతారాంబాగ్, హైద్రాబాద్, S. V. O. కళాశాల, తిరుపతి.

ఉద్యోగము : 1956 నుండి సికింద్రాబాద్ మహబూబు కళాశాలలో ప్రధానాంధ్రాధ్యాపకత్వము (అధ్యాపకవృత్తి).

ఉద్యోగవిరమణము : 1992 ఏప్రిల్‌లో అదే కళాశాలనుండి ప్రధానాంధ్ర అధ్యాపక వృత్తినుండి విరమణము.

బిరుదము : మహబూబుకళాశాలాధ్యాపకులు, తత్ప్రధాన కార్యదర్శి (సెక్రెటరీ) మేజర్ విశ్వనాథంగారు కవి పండితసభ నేర్పరచి వారి నిర్ణయ ప్రకారముగా 'కవితాకోవిద' అను బిరుదు ప్రదానముచే ఆచార్యుల వారిని సత్కరించిరి.

సేవ : సంస్కృతాంధ్ర సాహిత్యసేవ; కవితా చిత్రకళారాధన.

అభిమత విషయములు : సంస్కృతాంధ్ర సాహిత్యములు, ఉభయవేదాన్తములు, చిత్రకళ, కవితారాధన, నాట్యకళ.

## రచయిత యితర కృతులు - ముద్రితములు :

1. శ్రీ (పీరాచల) జీడికంటి రాఘవోత్తమ శతకము 1962 (తొలికృతి)
2. శ్రీ వేంకటపతి సుప్రభాతమ్ (సంస్కృతము-బిర్లామందిరము) 1977
3. శ్రీ వేములవాడ రాజరాజేశ శతకము (పబ్బా శంకరయ్యగారు) 1978
4. శ్రీ మారుతాత్మజ సుప్రభాతము (తాడుబంద్, సికింద్రాబాద్) 1977
5. శ్రీ (కొడంగల్) వేంకటేశ్వర శతకప్రబంధము (దేవస్థానప్రచురణ) 1980
6. శ్రీ తాండవ మదనుడు (సుమధన్వ నృత్యము-గేయప్రబంధము) 1982
7. శ్రీ మహాకాళీ సుప్రభాతమ్ (సంస్కృతము-సికింద్రాబాద్ మహాకాళీదేవి) 1983
8. శ్రీ శారదాతత్వ చింతనము (వాసర సరస్వతి) కరుణశ్రీ ప్రింటర్స్, 1983
9. శ్రీ రాఘవోత్తమ సుప్రభాతమ్ (సంస్కృతము, చైతన్యపురి దేవస్థానము) 1984
10. శ్రీ అయ్యప్పస్వామి వ్రతవిధానము శ్రీ రామా పబ్లిషర్స్) 1985
11. శ్రీ రాధికామనోహరీయ ప్రబంధము (పద్యకావ్యము (8 ఆశ్వాసములు) 1986
12. శ్రీ రఘునందన కుశేశయ ప్రబంధము (భద్రాదిరాముడు) 1987
13. శ్రీ స్తుతివైజయన్తి (పంచకుశేశయ ప్రబంధము). 1987
14. శ్రీ లక్ష్మీనృసింహ స్తుతివైజయన్తి (యాదగిరిక్షేత్రము) 1990
15. శ్రీ స్తుతివైజయన్తి (కుశేశయ చతుష్కము) 1991
16. శ్రీ భారతీ కుశేశయము (స్తుతివైజయన్తి - వాసర సరస్వతి) 1992
17. శ్రీ యాదగిరి లక్ష్మీనృసింహ స్తుతిరత్నమాలా - గద్య ప్రబంధము - 1990
18. శ్రీ యాదగిరి లక్ష్మీనృసింహ ఉదాహరణ కావ్యము (తారావళి - సంస్కృతాంధ్రములు, 1993
19. శ్రీ విబుధ సూక్తి సుధాకరము (నీతి కావ్యము) (శ్రీ రామా పబ్లిషర్స్ ప్రచురణము) 1994